# ఒన్లిడాటర్.



ర చ యి త :

కొవ్వలి వేంకటరమణారావు.

# ఓన్లీ డాటర్.

(పండితపామరజనరంజకమగు సాంఘిక నాటకము)

రచయిత :

("చిట్టగాంగ్ [illegible], [illegible], [illegible], భాగ్య[illegible] [illegible] గ్రంథకర్త)

[illegible] కటారి [illegible] రావు, కాకినాడ.

[illegible]

కాకినాడ జగన్నాథపురము

శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాలవారిచే ముద్రింపబడి

రచయితచే ప్రకటింపబడినది.

1938.



వెల రు. 0-12-0.



శ్రీయాంజనేయనమః ॥

# ఓ స్లీ డా ట ర్

ప్రథమాంకము

## మొదటిరంగము

ప్రదేశము:—గృహాంతర్భాగము

[ ప్రవేశము:—గోపాలరావుగారు ]

గో:- సీ॥ పరులసొమ్ములఁ బడ ƒ వైచుకొనెడివాఁడె
కాంచినదెల్ల బం ƒ గారమగును;
పిల్లికి బిచ్చంబుఁ ƒ బెట్టని పిసినారి—
ప్రాప్తించునాస్తి వా ƒ రసుల నలక;
సతతమున్ జీవహిం ƒ సలఁజెల్లు గటికిఁ గ
సాయివాఁడె మనున్ జ ƒ రాయువుగను;
అన్యాంగ నారతిఁ ƒ గాంక్షించు పాపాత్ము
సిల్లాలె సాధ్వీమ ƒ తల్లియగును;
గీ॥ తల్లిదండ్రుల నెదిరించు ƒ తనయుఁడె యభి
*మాన పుత్త్రుఁడౌ వారసం ƒ తాన మందు;
నటుల, నిన్ను దూషించు వా ƒ రగుదురయ్య
నీకు నాపులుఁబరమేశ! ƒ నిక్కముగను!

దేముఁడే, లేఁడనే వాళ్లతో నే నేకీభవిస్తాను. ఉంటే, ఏంజేస్తున్నాఁడా దేముఁడు? ఈజన్మలోఁ జేసుకున్న పాపాలు, ఈజన్మలోనే అనుభవించాలంటారు! ఏదీ, అలాజరగడములేదే! అయితే, పుట్టు గ్రుడ్డి వాఁడెప్పుడు పాపాలుచేశాఁడు? ఇంకొక జన్మవున్నదనా? నట్టిది. ! అంతా పట్టిమాయ !

( ప్రవేశము:—అప్పలమ్మ )

అ:— బాబూ గోపాలరావు బాబుగారు, సుందరమ్మగారి కీయాల ఒంట్లో బాగులేదండి ఏఁటోగాని: బిక్కచచ్చి పోయినట్టున్నారండి !

గో:— ఏం ? భోజనము చేసిందా ? లేదా ?

అ:— ఏంటో! ఆఁకలిలేదు ! అన్నమూవద్దు, నానల్లకాఁ ఫీూవద్దు, అంటున్నారండి.

గో:— (ఆలోచించుచు) ఆఁకలిలేక పోవడానికేమింతింది యీవేళ ? ఇంట్లో, వంటవాఁ డేమీ చెయ్యలేదే ! ఒకవేళ, అజీర్ణముచేసిందేమో ? సరేలేవే ! అప్పలమ్మాయి, అమ్మాయిని నాదగ్గరకు పంపు!

అ:— సిత్తము బాబూ ! (అనిపోవును)

గో:—అజీర్ణము చేసియుండదు; కాని ఏదో మనస్సులో బెంగపెట్టుకుంది కాఁబోలు ! అందుకే, తిండి మానేసుంటుంది ; సరే, మాటాడి చూద్దాము!

(ప్రవేశము:— సుందరమ్మ)

సుం:— (భిన్నవదనురాలై వచ్చి గోపాలరావుగారియొద్ద కూర్చుండును)

గో:—సుందరం! అన్నంతినలేదేమి అమ్మా, ఇవాళనువ్వు ?

సుం:—ఆఁకలి లేదండి నాన్నగారు!

గో:—ఆఁకలైనంతే తిను తల్లీ! బొత్తిగా తినకపోతే తేఁపటికినీరసము చేస్తుంది! అయ్యో, వెఱ్ఱితల్లి! లే! పద! నేను నీకు సాయము కూర్చుంటాను నువ్వన్నము తింఁటుంటే!

సుం:—ఏమీ యాఁకలిలేదండి నాన్నగారు!

గో:—అమ్మవు కావు! నాతల్లివి కావు! తినవు?

సుం:—ఆఁకలి అవకపోతే ఏలాగ చెప్పండి తినడము?

గో:—ఏలాగో నేను చెప్తాను; లే! (అని సుందరమ్మను బతిమాలు కొనుచుండును.)

సుం:—లేస్తానుకాని, నాన్నగారు, నామాటేమిటండి?

గో:—(బతిమాలుకొనుటమాని) నీకేమి సుందరం, నాకంఠములో ప్రాణముండఁగా! అందుకనేనా, అన్నముమానేశావు? లే! పద! నువ్వు అన్నము తినుముందు!

సుం:—అన్నంతింటానుగాని, నాన్నగారు! నన్నీలాబదిలేశినట్టే! నాకు పెళ్లి చెయ్యరు?

గో:—నిన్ను ఒదిలెయ్యడమా! అయ్యో, నువ్వులేకపోతే, నాకీయిల్లు, వాఁకిలి, సంసారమెందుకు తల్లీ! మీయమ్మపోయినపుడే నేనూ, ఏకాశీకో, రామేశ్వరమో పోయియుండేవాఁడను. నువ్వు బయలుదేరావు కనకనే అప్రయత్నాలు మానుకొని నీకు పెళ్లి చేసి పెద్దనిర్వాహకములోనికి తీసుకొనివచ్చి నీముఖము చూచుకొనుచు బ్రిదుకొద్దామనుకున్నాను; కాని తానొకటి తలిస్తే దైవ మొకటి తల్చాఁడు. ప్రేమతో పెంచిన మొక్క ముక్కలయిపోయింది.

సుం:—ఏమండీ, నాన్నగారు, "తానొకటి తలిస్తే దైవమొకటితల్చాఁ" డంటున్నారు! మీరేమి తల్చారు? దైవమింకేమితల్చాఁడు?

గో:—(నిట్టూర్పు విడచుచుండును.)

సుం:—చెప్పరు నాన్నగారు, అదేమిటో?

గో:—చెప్పడానికేముంది, నీకుపెళ్లి యిదివరకేచేశాను (అని విచారించుచుండును.)

సుం:—(ఆశ్చర్యముతో) నాకు పెళ్లిచేశారా? అదెప్పుడు?

గో:—చిన్నప్పుడేచేశాను నీమేనమామ కొడుక్కి! పెళ్లిచేసినదాకా చంపుకు తిన్నాడా మేనమామ! మాఅక్కయ్య పోనే పోయింది, మాఅక్కయ్యపేరుమీఁద ఆపిల్లబయలు దేరిందికదా, ఆపిల్లను నాపిల్లాఁడికిస్తావా, యియ్యవా అని గుమ్మముసడుమెక్కి అభోజనాలుచేసి చేయించాడాపెళ్లి! బొత్తిగా చిన్నపిల్ల,అపుడేపెళ్లికేమి తొందరోయి బావా, నీదగ్గరపిల్లాఁడెదుగుచున్నాఁడు; నాదగ్గర పిల్ల ఎదుగుచున్నది కదా! వాఁడికి భార్యకావలసివచ్చినపుడు నాకూతురికి భర్తకావలసివచ్చినపుడు పెళ్లిమాట ఆలోచిద్దామని ఎంతచెప్పుకొచ్చినా; "అపుడు నీకేమి బుద్ధిపుడుతుందో" కలసివచ్చిన సంబంధం అని, అమ్మయ్యమ్మయ్యా, పెళ్లి అయినదాకా మంగలములోపెట్టి వేయించినట్లు వేఁపుకొని తిన్నాఁడు. సరే, కుఱ్ఱాఁడుకూడా బుద్ధిమంతుఁడు పెద్దక్లాసులులో చదువుచున్నాఁడని ఒప్పుకున్నాను. నిన్నుఁదీసుకపోయి వాళ్లింట్లోనేపెట్టి చేయించాఁడాపెళ్లి! మీయమ్మలేని లోటు చేతనేనాట్టే ఉత్సాహముగాలేను. ఏదోయింతడబ్బు కావాలంటే యిచ్చేశాను.

సుం:—నేనెఱుఁగను నాన్నగారు, నాకుపెళ్లయినట్టు! ఎన్నోయేఁటనండి?

గో:—(విచారముతో) అయిదవయేఁట!

సు:—నాకేమీ జ్ఞాపకములేదు! కాని, యెపుడో, పల్లకీలోగూర్చుండపెట్టి యూరేగించినట్టు మాత్రము కొంచెము జ్ఞాపకమునకు?

వచ్చుచున్నది అదినాపెళ్లే! ఊఁఊఁ! ఇంకా, ఎవరిపెళ్లిళ్లలోనో చూడండి దగ్గిరబంధువులపిల్లల్ని కూర్చుండపెట్టుంటారు పల్లకీలలో, ఆలాకూర్చోపెట్టారేమో అనుకుంటున్నాను. అదినాపెళ్లి అన్నమాటే !

గో:—(గద్గదస్వరముతో) అవును. (అని తలవాల్చికూర్చుండును)

సుం:—సరే, పెళ్లిచేశా రయిదోయేఁట ! తరవాత ఏమిజరిగింది ? ఎక్కడున్నాఁడు మాబావ ? ఏదైనాపట్నమువెళ్లఁడా చదువుకుందుకు ?

గో:—వెళ్లాఁడు చెన్నపట్నము ! అక్కడ విషజ్వరాలు వచ్చాయి ఒకప్పుడు ! వాటిలో....... (అనిఊరకుండును.)

సుం:—వాటిలో... చని పోయాఁడా ?

గో:—ఊఁ ! (అని యేడ్చుచుండును.)

సుం:—అదా అసలుసంగతి ! అందుకనే, సన్నెపరుచూచినా, గుసగుసలు, గసగసలు; అప్పలమ్మయినుండైనా చెప్పింది కాదోకనాఁడూను, పాడుముండ ! అయితే, నేనువిధవననుమాట! కాదండీ నాన్నగారు !

గో:—దాన్ని నేనే చెప్పొద్దన్నానులే !

సుం:—ఆలాచెప్పండి ! సరేకాని, నాన్నగారు, ఇన్నాళ్లవరకు మాటపెట్టినసంగతి యిప్పుడు చెప్పారుకనక, నాకోసం దేహమువచ్చుచున్నదిఁ అడగనా ?

గో:—అడుగమ్మా ! అడుగు ! అడగడమేమిటి! చెప్పతీసుకొనికొట్టు అంత చిన్నప్పుడు పెళ్లెందుకుచేశారని ! పడ్డాను !

సుం:—ఊరుకోండి నాన్నగారు, ఏమి మాటలవి !

గో:—తల్లి ! ఏమిటి యడుగుతానన్నావు? అడుగవు !

సుం:—నాన్నగారు, ఆపెళ్లికి నేనేమిభాద్యురాలను? వివాహామైచ్ఛికముగదా ! వ్యక్తి స్వాతంత్ర్యముండని పరిణయ బంధమున నా జీవితోద్యానవనమును గాఢాడవిగా మార్చుట మీకుఁ దగదు.

చ॥ పరిపాలనకా ప్రపంచకము | పాటముగా నది దున్నకాడి యె
డ్ల రయఁగ దంపతుల్ గరుపఁ | యత్నముమై జతయెడ్ల నేర్చి కూ
ర్చు రయితువోలె తండ్రితన | రున్ దనబిడ్డలకెల్ల భూమిపై
స్థిర ఫలసాయముల్ గలుగఁ | జేయు విధంబిటులుండు తండ్రికిన్.

గో:—అయిన, నన్నేమిచేయుమందువు? తల్లీ !

సుం:—నాయనుమతిలేక మీరు సల్పిన నా ప్రథమ పాణిగ్రహణమును రద్దుచేసి మీరు నాకు మరలఁ బెండ్లి సేయుఁడు.

గో:—రద్దు భగవంతుఁడే చేశాఁడుకదా! అమ్మాయి ! నీకుమళ్లీ పెళ్లి చేశానంటే, నేనీవూళ్లో వుండలేను !

సుం:—మీకేమీ ! నాకు పెళ్లిచేసి నాపెనిమిటితో నన్నుఁబంపించెయ్యండి. మాబ్రదుకు మేము బ్రదుకుతాము.

గో:—ఫలానివారు కూతురు ఫలానిపనిచేశిందని అనుకోరూ! మీ మేనమామగారి కుటుంబము, వేలుముడ్చిచెప్పుకోడానికి వీలు లేని కుటుంబము ! మాకుటుంబము సరేకదా !

సుం:—ఇప్పుడిందులో దోషమేముందండి నాన్నగారు? ఒకచనిపోయిన వ్యక్తికొరకు, బ్రదికియున్న వ్యక్తితనకు బాధ్యతలేని సంబంధ నెపమున జీవితము పాడొనర్చుకొనుట పాడికాదు. జరిగినదానికి వగవఁబనిలేదు. ఇప్పటికి మించి పోయినదేమియులేదు. నా వయసు వారికి నాంగ్లేయదేశములలో నింకను బెండ్లిమాటలే జరుగవఁట !

గో:—అమ్మాయి! చూడు! ఆంగ్లేయులనుజూచి మనమేమి చేసినా పులిని చూచి నక్క వాతపెట్టుకొనినట్లే హాస్యాస్పదమగును. ఆ దేశాచారములు వేరు. ఆశీతోష్ణపరిస్థితులు వేరు; అంతా వేరే! ఇంతవరకెందుకు! మనవాళ్లు "సూట్లు" "బూట్లు" వేస్తారుకదా వాళ్లనుజూచి, వాళ్లెవళ్లయినా ఒకళ్లు ధోవతికట్టడము చూశావు నువ్వు?

సుం:—ప్రపంచకములో కంతానాగరకతనొందిన జాతివారిదే కదా!

గో:—ఆఁ! ఏమినాగరికత పోనిద్దూ! ఆఁడదిమగాఁడు, రాసుకొనితిరగడము నాగరకతా? ఎవరిహద్దులలో వాళ్లుంటే మర్యాదగా వుంటుందా! హద్దుమీరి సంచరిస్తే మర్యాదగా వుంటుందా? మనహిందూదేశము మంచికర్మభూమి! దానిసాంప్రదాయాలు, దానిలక్షణాలు చస్తే యింకో దేశానికిరావు!

సుం:—పోనీకానండి నాన్నగారు! ఆఁడుది మగాఁడు కాకుండా వుంటాను, నాకుఁ జదువైనాచెప్పించండి.

గో:—చదువా!............ఊఁ! సరే, చదువుకుందుగాని!

సుం:—ఏమిటో అనుమానంగా చెప్తున్నారే?

గో:—అనుమానమేమీలేదు, దానివల్ల ప్రయోజనమేమా అనిఆలోచిస్తున్నాను.

సుం:—ప్రయోజనమేముంది; ఊబుసుపోతుంది; కొంచెము మంచిచెడ్డా తెలుస్తుంది.

గో:—సరేలే, అన్నానుగా!

సుం:—మరెప్పటినుండి ప్రారంభము?

గో:—ప్రారంభిద్దుగాని యిప్పుడు సంవత్సరమధ్యమందు ఏస్కూల్లోనూ చేర్చుకోరు. అందాకా ప్రయివేటుగా చదువు కుందుగాని;

స్కూళ్ళు సెలవులాఖర్ని తెరిచేటప్పటికి యేదో క్లాసులోకి, యేక్లాసుకు ఫిటు అవుతావో, ఆక్లాసులోకిఁజేర్పిస్తాను.

సుం:—నాకు సంగీతముకూడా నేర్చుకోవాలని వుందండి మరి !

గో:—సరే, సంగీతము, సాహిత్యము రెండూవచ్చిన వాఁడినేపెట్తాను. కాని, యెవరైనా మంచివాఁడుదొరకాలి !

సుం:—లక్షమందిదొరుకుతారు ! మీకు అసలావుద్దేశముంటేను !

గో:—ఉద్దేశము లేక కాదమ్మా! సరైనవాఁడు దొరకాలి. "బుడుంగ మనగానే గాలము వేయఁగూడదు. చూడు" !

సుం:—దొరుకుతాఁడు సల్గురుతోటి చెప్పివుంచండి. ఏమీ, మన ప్లీడరుగారి అమ్మాయికి సంగీతముచెప్పే మేష్టరుపనికిరాఁడు?

గో:—వాఁడుట్టి దొంగ ముండావాఁడు. అదిగాక, సంగీతపుమేష్టర్లున్నారే, వాళ్లలో ఎక్కడోకాని పెద్దమనుష్యులుండరు !

సుం:—మీరన్నిటికి ముందరకాళ్లకు బంధాలు వేయడమే ! పోనీయండి, నాకు చదువువద్దు ! చట్టుబండలునద్దు ! (అనిమూతి బిగించును.)

గో:—సుందరం! ముక్కుమీఁద నుంచేకోపంనీకు ! మేష్టర్నిచూడా లన్నానుకాని, అసలు నీకుచదువు సంగీతము వద్దన్నానా ?

[ ప్రివేశము:—శంకరము. ]

శం:—సీతారామాభ్యాయనమః! ఈవేళ, మఘనక్షత్రమండి, తదీయా శనివారము దివమందు ఝామువొద్దెక్కినదాకా వుంటుందండి తదియ; తరవాత చవితివస్తుందండి; రాత్రి పదిగంటలకి వర్జ్యము; పగలు వర్జ్యములు లేవు.

సుం:—నాన్నగారోయి, మనశంకరంగారితోఁజెప్పండి మేష్టరు సంగతి. ఆయనకు తెలిసివుంటుంది, అన్ని యిళ్లు తిరుగుతుంటారు గనుక!

గో:—ఆఁ! శంకరముగారూ!

శం:—అయ్యా! ఏమిసెలవు (అనిదగ్గరకుఁ జేరును)

గో:—మాకూ, ఒక మేష్టరు కావాలండి; సంగీతము, సాహిత్యము బాగా తెలిసినవాఁడు!

శం:—ఏం, అమ్మాయికి సంగీతము చెప్పిస్తారా? చెప్పించండి పాపము!

సుం:—పాపమేమిటండోయి!

శం:—ఆహాఁ! ఊతపదముకాని, పాపమంటే పాపమే! పుణ్యమంటే పుణ్యమే!

గో:—మహాఁచెడ్డవాఁడవయ్యా! శంకరం! ఏమిటి! ఎవరినైనా ఎఱుఁగుదువా! లేదా!

శం:—"వెదుకఁబోయిన తీవకాలదగిలెన్ వేవేఁగ*"నన్నట్లు, నేఁడు సుదినము! పంతులుగారు! మంచి సంగీతము మేష్టరున్నాఁడండి; నాకుఁదెలుసున్నవాఁడు; మఱి, మీరెవ్వరికి మాటివ్వకండి?

గో:—అబ్బే! ఎవరికీ మాటివ్వను; ఏదీ! ఇపుడే అనుకుఁటున్నామా మాటకూడాను!

శం:—పంతులుగారు! ఈవేళ "అక్షయపాత్రికి" స్వస్తి చెప్పేసి యింతటితో పరుగెట్టిగెళ్లి వాఁడిని తీసుకొస్తాను సెలవియ్యండి; "ఆలస్యాదమృతమ్ విషమన్నారు" అనక, అంటే, ఏమో అనక ఎవరో మనమెవరమో!

గో:—అసాధ్యుఁడవోయి శంకరం! ఫరవాలేదు! నెమ్మదిగా, రేఁపుదయము 8 గఁటలకు తీసుకొనిరా, అప్పటికి కాఫీలు అయిపోతాయి! సాయంకాలముగాఁ కూర్చుండి కాస్సేపు పాడిద్దాముగూడాను మేష్టరుగారిచేత!

---

* ఇచ్చట తిథులు నక్షత్రములు ప్రదర్శన దినములనాఁటి తిథులు నక్షత్రములతో మార్చుకొనవలెను.

సుం:—పోనీ, వెళ్లి తీసుకొనిరానివ్వండి నాన్నగారు! ఇపుడాట్టే ప్రొద్దు పోలేదుగద !

గో:—ఊఁ ! కానీయ్యండి ! నీకుత్సాహ భంగము చేయడమెందుకు ? శంకరంగారు పదండి !

శం:—(ఆలోచించుచు నిలువఁబడును)

గో:—ఏమి, మళ్లీ వెళ్లరే! అప్పుడున్న మనస్సిప్పుడు మారిపోయిందా?

శం:—కాదండీ, ఇంత పెందలాడే వచ్చేశావింటికింకా చెంబునిండ లేదే మని మా యావిడ చీవాట్లు పెట్టుతుందేమో అని సంశయిస్తున్నానండి !

గో:—
సుం:— } నగుదురు.

గో:—సరి సరి ! పెళ్లాము నిన్ను చీవాట్లుపెట్టడమే ! సుందరం ! వెళ్లి ఆచెంబునిండా బియ్యముపోసుకొనిరా !

సుం:—(నవ్వుచు నట్లుచేయును)

శం:—(సంభ్రమముతో) ఇఁక వెళ్లివస్తానండి ! మీారెక్కడకీ వెళ్లి పోకండేఁ !

గో:—ఎక్కడకీవెళ్లముగాని, నువ్వు వెళ్లిరా ! చూడు శంకరం ! నీవేవేళకీ రాకపోతే పెళ్లాము నిన్ను రానిచ్చిందికాదని అనుకోమా, లేక ఏమనుకోము ?

శం:—పంతులుగారు, ఎగతాళిచేస్తున్నారు నన్ను ! వైదీకపువానిని గనుక తేలేశాను; నియోగపప్రభువులు తేలరు ! కాని పెళ్లాల చేత తిట్లో, చివాట్లో తిననివారెవరండీ యీా రోజులలో ?

సుం:—నాన్నగారు, శంకరంగారిని వెళ్లనివ్వండి ! అబ్బ !

గో:—పోవయ్యా !

శం:—ఇదిగో బాబు ! వెళ్లుతున్నా (అనిపోవును)

సుం:—నాన్నగారు, శంకరంగారికందఱూ తెలుసునండి !

గో:—తెలియదు? తెల్లారితే యెక్కడుమ్మము దిగేగుమ్మము. న్యూసు పేపరు ఆయిన నోరు ! (అనుచుండగా)

[ప్రవేశము:—శంకరము: సంగీతపు మేష్టరు]

శం:—(సంగీతపు మేష్టరు నుద్దేశించి) నమస్కారమండి పంతులుగారూ "అను" నీదగ్గాకేమీ లోటురాదు !

సం:—Good morning sir అనఁగూడదు ?

శం:—ఏమిటి ? కూడుమానేశావా? ఆట్టె వెఱ్ఱి వెఱ్ఱి వేషాలు పోక సరిగా నమస్కారము పెట్టు !

శం:—(గోపాలరావుగారినిఁజూచి) ఇదుగోనండి ! సంగీతపు మేష్టరు !

సం:—నమస్కారమండి పంతులుగారు !

గో:—ఈప్సితార్థ సిద్ధిరస్తు ! రండి కూర్చోండి ! మేష్టరుగారు ! (అని కుర్చీ చూపును)

సం:—(కుర్చీపైఁ గూర్చుండును)

గో:—(శంకరంగారినుద్దేశించి) మీరూ కూర్చోండి శంకరంగారు !

శం:—ముష్టియెత్తుకొనేవాఁడికి కుర్చీలెందుకండి ! నేను నిలువఁబడ తాను మరేమి ఫరవాలేదు !

సుం:—మీరు కూర్చోవాలండి శంకరంగారు !

శం:—అలాగేనమ్మా కూర్చున్నట్టే! కానివ్వండి, మాటలు కానివ్వండి!

గో:—శంకరంగారు, ఈయనఎవరండి ?

శం:—వీఁడు మాకుఁ గావలసినవాఁడేనండి! స్కూలుఫైనలు మొన్ననే ప్యాసయ్యాడండి; ఏమీ యుద్యోగము దొరకలేదు; అందాకా, సంగీతము పాఠాలు చెప్పుకుంటున్నాడండి !

గో:—మీసాలు తీసేస్తున్నారు; నాటకాలలో ఆఁడవేషాలు వేస్తారా?

శం:—మీసం, పేను కొఱికిందండి; ఆ కొఱకడంలోను, దానికిఁగోసిన పేను గొగ్గి గొగ్గిగా కొఱికింది ! అసహ్యంగా కనబడుతుంటే, శుభ్రంగాఁ దీయించేసి మందారనూనె గట్రా రాసుకుంటున్నాడండి మళ్లీ మొలవడానికి !

సుం:—ఏదన్నా పాడమనండి శంకరంగారు ! విందాము !

శం:—పాడరా !

సం:—గొంతుక పోయిందండి! (అని గొంతుక సవరించుకొనుచుండును)

శం:—ఏమైపోయింది గొంతుక? అసలు వున్నదాలేదా? అది చూసికో ముందు !

గో:—ఈసంగీతము వచ్చినవాళ్లందరికీ యిదో అభ్యాసమండీ, గొంతుక పోయినదంటమో, గొంతుక లేవదంటమో యేదో ఒకటి !

శం:—బాగా చెప్పారు! అభ్యాసముకాదండి! అదొక విధమైన జబ్బండి! అమ్మాయి, సుందరమ్మగారు, వెళ్లి మీహార్మోనియము పట్రాండి!

సుం:—(వెళ్లి తెచ్చి సంగీతపుమేష్టరుగారికిచ్చుచుఁ గ్రీగంటిచూపులఁ జూచును)

సం:—(శ్రుతివేసి రాగాలాపముఁ జేయుచు)

ఉ॥ శత్రువులొక్క వంక; మత కసాంఘిక చర్చలవొక్క వంక; స ర్వత్రనశక్తివంతులు సృ కపాలురొకా నొక వంక; క్రూరమా చిత్రవధల్ వృథామరణ కశిక్షలు వేరొక వంక; క్షామమున్ ధాత్రిని నిల్ల వంకల స కదా వెతఁగూర్చెడు రాజ్యలక్ష్మికిన్.

శం:—ఎందులోదిరా యీపద్యము చాలా బాగుంది ?

సం:—నేనే రాశాను; హంపీ విజయనగర వినాశనమని పద్యాలతో ఒక వ్యాసము వ్రాస్తున్నాను. అందులోది యిది ! బాగుందా తాతా ?

శం:—"తాతా !" ఇప్పుడంటే అన్నావుకాని, మా ఆవిడ చూస్తుండగా అన్నావంటే కొంప మునుగుతుంది జాగ్రత్త !

గో:—మీ యిద్దరికి "తాతా మనుమఁడు" వరసా, బాగుంది ! ఆఁ ! శంకరంగారు బాగుంది పద్యము; కవిత్వముకూడా "నున్న"గా వుంది; తెలివైనవానిలాగే కనబడుతున్నారు ఉండనివ్వండి, మనకుఁబనికొస్తారు, ఱేపటినుంచి ప్రారంభించమనండి పాఠాలు!

శం:—చిత్తము చిత్తము ! (అని నిలువఁబడియుండును)

సం:—(లేచి నిలువఁబడియుండును)

గో:—జీతముసంగతి మనము మాటాడుకోలేదు; దానికేముంది; ఒకళ్ళు ఎలాగిస్తున్నారో అలాగే నేను గూడా యిస్తాను.

శం:—అబ్బే ! ఆసందేహము లేదండోయి ! ఒకళ్లకన్నఎక్కువేయిస్తారుగాని తక్కువ యివ్వరు మీరు! నాకుఁదెలుసునుమీసంగతి!

గో:—అవునుకాని; ఱేపు ఎపుడుమంచిది ? వర్జ్యాలు ఎన్నిగంటలకి ?

శం:—(తొట్రుపాటుతో) కాసేపు పోయాక వచ్చి మనవిచేస్తానండి !

గో:—ఏఁ ! ఇపుడెందుకుఁ జెప్పఁగూడదు ?

శం:—మీరు నాసోదరుని వంటివారు గనుక చెప్తున్నాను;నాకూ చదువు రాదండి. మా యింటిదే చదువుకొంది, ఏరోజుకారోజు అదే పంచాంగము చూచి నాకు తిథివార నక్షత్రాలు చెప్తుంది. అవి ముక్కున పట్టుకొచ్చి గుమ్మము, గుమ్మముదగ్గర వాగిపోతుంటాను!

గో:—హారి పిడుగా ! సరేలే ! తర్వాత చెప్తా ! చెప్పడమెందుకు ! ఎప్పుడు మంచిదో, అప్పుడు మేష్టరుగారిని పంపించెయ్యి ! (సంగీతపు మేష్టరుగారివైపుఁజూచి) వర్జ్యము లేకుండా చూచి మీరే, వచ్చెయ్యండి, అమ్మాయి సిద్ధంగానే వుంటుంది !

సం:—చిత్తము; నేనే వచ్చేస్తానండి ; (అనిపోవుచుండును)

శం:—మరి సెలవా ? (అని పోవును. అతనివెన్క గోపాలరావుగారికి నమస్కరించి సంగీతపు మేష్టరుకూడ పోవును)

సుం:—(సంతోషముతో) నాన్నగారు, మేష్టరుగారు తెలివైనవారి లాగే యున్నారు కాదండి; సంగీతము వచ్చు; కవిత్వము వచ్చు; ఇంగ్లీషు వచ్చు ! ఎన్నో వచ్చు ! ఎంచక్కాను !!

గో:—సంగీతానికే, స్కూలులో చదువుకున్నవాఁడు ఏకూనిదీర్ఘమో తియ్యనివాఁడుండఁడు. అందులోనూ, ఈస్కూళ్లలో నాటకాలు వెయ్యడము మొదలెట్టాక చదువుమీఁద సరదాపోయింది; సంగీతముమీఁద ఆకర్షన హెచ్చింది. ఎంచేతనంటె, స్కూళ్లల్లో గరల్సు చదువుతుంటారు; యీవేషాలు వేసిన కుఱ్ఱాళ్లు వాళ్లు చూడాలని స్పెషల్‌గా నాటకిమాడించే మేష్టరుకి ముందుగా ఏరెండు మూఁడునెలలలో సేవఁజేసి ఒక వేషము వేస్తారు. ఆనాటకమాడిన మర్నాఁడు, ఆరింగులైనా సరిగా కడుక్కోరు; నాటకంనాఁడు వేషాలుమీఁద, ఏకోట్లు తొడుగుకున్నారో, ఏఖండవాలు వేసుకున్నారో అవి వేసుకొని స్కూలంతా కలయ తిరగము. ఎందుకో తెలుసునా !

సుం:— గరల్సు చూడాలని !

గో:—అవును గరల్సు చూడాలని సరే కవిత్వము; దానికేం, నాల్గో ఫారమునుండి ఛందస్సు తెలుఁగు మేష్టర్లు ఎలాగా చెప్తారు. కాస్త బుఱ్ఱవున్నవాఁడు వృద్ధిచేసుకుంటాఁడు. లేనివాఁడు

అక్కడదక్కడే దులిపేశిపోతాఁడు ఇఁక ఇంగ్లీషు; స్కూలుఫైనలు దాఁకా చదివినవాఁడికి ఇంగ్లీషు రాదూ ?

సుం:—మీరలా అన్నారా నాన్నగారు; మన సుబ్బమ్మగారికొడుకు ఎఫ్. ఏ. ప్యాసయాడఁట ! ఎప్పుడూ, ఇంగ్లీషే మాటాడఁడు. ఒకవేళ, మాటాడితే అన్నీ తప్పులేనఁట !

గో:—తప్పులుగావు మఱి ! వాఁడు కాపీకొట్టి అందాఁక వచ్చాఁడు; అదికాక, స్కూళ్లల్లో మేష్టర్లు ఎంతసేపూ వాళ్లుగొంతుక చించుకొని అరవడమేకాని, కుఱ్ఱముండావాళ్లచేత వాళ్ళల్లో వాళ్ళని మాటాడించడము; తప్పులుంటే సవరించడమూ లేదు; "వాళ్లే ఎంతసేపు అరవడము !

సుం:—అలాగా ? అందుకనే, కుఱ్ఱాళ్ళలా తయారగుచున్నారు !

( ప్రవేశము:—అప్పలమ్మ )

అ:— ఏటి బాబు ! అమ్మాయి భోంచెయ్యనేదు ! ఏంచేప్పూ, పూసు లాడ్డముతోటే సరిపోతుంది. లెగిసి, కాస్త కూడుదని కూకోమ నండి ! మీరు, మంచోరే !

గో:—అవునేవు అప్పలమ్మ ! మాటల సందడిలో మఱచిపోయాను. (సుందరమ్మవైపుఁ జూచి) అమ్మాయి, మడిగట్టుకో ! లే ! (అని లేవదీయును)

సుం:—(లేచి) నాన్నగారు; అన్నము తినాలనిలేదు కాని, టిఫెను తీసుకుంటానండి !

గో:—రెండు ఝాములయింది ! ఇపుడేమి టిఫెను ! వంటవాఁడు వున్నాఁడో లేఁడో ? ఏమైనాచెయ్యడానికి !

అ:— ఆఁడెక్కడున్నాఁడూ! ఆఁడు తినేశి, అప్పుడే అరగంటసేపయింది సత్రము అరుగుమీఁద కూకొని "రన్ మోరు" ఆడుతున్నాఁడు!

సుం:—మరేలాగండి నాన్నగారూ ?

అ:— ఏమి సిటికిలిల్లు ! ఎల్లి కూడుతిను సుందరం !

గో:—ఏమిటి, అన్నము తింటావా ? నన్ను హోటల్లోకి వెళ్లి ఏమైనా తీసుకురమ్మన్నావా ?

సుం:—మీరుహోటల్లోకి వెళ్లి తీసుకురండి ఏమైనా !

గో:—సరే ! అప్పలమ్మ ! ఆ Flask యిలాపడెయ్యి !

అ:— (తీసుకొనివచ్చియిచ్చి) హోటేళ్ళల్లో ఏడిసెనగనూనెతో ఒండుతారు; తినకమ్మా, ఒంతులట్టుకోగలవు !

గో:—(Flask పట్టుకొని పోవును)

సుం:—పదవే! ఏదో సొద వెళ్ళఁబోస్తుంటావు! (అని లేవ్వఁబోవును)

అ:— (వెంటఁబోవును)

(తెరపడును)



# రెండవ రంగము.

ప్రవేశము:—గంగమ్మ.

(ప్రదేశము:—ఇల్లు)

గ:—“కుక్కకు పనీలేదు తీరుబడీలేదని” మాఆయన యీమధ్య మహాహడావిడిగా తిరుగుతున్నాఁడు. ఏమిటో ఆపని! వెధవ పనులన్నీ మీఁద పడేసుకుంటాఁడు! కూఁటికొచ్చినవా! కూర కొచ్చినవా! కొసకు చివాట్లు తప్ప మరేమీ మిగలడములేదు। (అనుచుండగా)

(ప్రవేశము:—శంకరం)

శం:— ప్రాణేశ్వరీ! నిర్ణీత సమయమునకే గృహమునకురాక నే నాలసించితినని నన్నింతగా దూరుచుంటివో కదే!

గ:—“ఏమిటది! చదవేస్తే వున్నమతీపోయిందని” ఏమిటా అచ్చ సంస్కృతము! ఏమండయినా, మంచెట్టినదా ఏమిటి! దేవుఁడా!

శం:— ఈయైశ్వర్యముచూఁచి పడేసుకోవాలని, అవును, ఏముండో మందు పెట్టేసింది!

గం:—లేకపోతే ఏమిటామాటలు?

శం:—అదికాదే! చెప్పినదాకా వుండందేనువ్వు? విను చెప్తాను. నేనింటికొచ్చేస్తుంటే, టౌనుహాలులో చాలామంది జనము కనబడ్డారు. ఏమిటి చెప్మా ఆతమాషా చూద్దామని నేనూ వెళ్లాను. అక్కడ గ్రాంధికభాష వ్రాయాలి గ్రంధాలలోఅని ఒక తెగవారును, గ్రామ్యభాష వ్రాయాలని మరొక తెగవారున్నూ, పండితులు, కాట్లకుక్కల్లాగ కొట్లాడుకొంటున్నారు. ఇది చోద్యముగానే వుంది చూద్దామని కాసేపు నిలువబడ్డాను. ఆవాదన ప్రతివా

సనములలో ఒకాయన అన్నాఁడు? వెనకో పండితుఁడు వుండే వాఁడు! ఆయన యింటికివెళ్ళి పెళ్ళాన్ని" గృహిణీ! గృహిణీ! పాదప్రక్షాళనార్థము పానీయములఁదెమ్ము "అనిన్నీ! వీధుల్లోకి ముష్టాళ్ళు వస్తే" భిక్షగాండ్రులార! మద్గృహంబున నేఁడు తండులంబులు నిండుకొనియె నేఁటికిఁబొండు! రేఁపురండు"అనిన్నీ అనేవారు అలాఅనడము వెగటుగానుండదా అని చెప్పాకొ చ్చారు. అది "ఐసరబజ్జా" అని ముక్కునపట్టుకొచ్చినిన్నేమయినా అలాంటి మాట ఒకటందామని యీనాలుగుమాటలుకూడ పలుక్కొని నీదగ్గరవాగేశాను. దానికప్పుడే నీకు "శివం" ఎక్కింది!

గ:—మంచిబుద్ధులు అబ్బవుకాని చప్పున! చెడ్డవి అబ్బుతాయి! పోనీ, వెనక ఒక మగఁడు పెండ్లానికి కాసులపేరు చేయించాఁడఁట! అలా నాపెళ్ళానికికూడా నేనూచేయిద్దామని బుద్ధిపుట్టకూడదూ?

శం:—దానికి డబ్బు కావాలి! దీనికక్కరలేదు.

గ:—అవును కాని, యీమధ్యను గోపాలరావుగారింటికి తిరుగుతున్నా రఁట జోరుగా! ఎందుకో నేను తెలుసుకోవచ్చునా?

శం:—నేను తిరగని యిల్లేది? అన్నీ నాయిళ్ళే!

గ:—అన్నిళ్ళసంగతి వేరు! ఆయింటిసంగతి వేరు?

శం:—ఏం! ఏమి కనిపెట్టావు తేడా?

గ:—తేడా! ఉండుచెప్తాను! వాళ్ళింట్లో అప్పలమ్మ వుందే! (దాసీది) దానితో మీరు స్నేహముచేయడము లేదూ?

శం:—శ్రీరామ రామ! అదేదో కష్టము సుఖము చెప్పుకొందుకు వాళ్ళిం టికి రమ్మంటుంది! దానికీ దానిమొగుఁడుకీ పడదఁట; ఎంత తెచ్చినా తాగేస్తాఁడఁట; ఇంటికి కానీ యివ్వడఁట; వేళకొచ్చి

అదోండావుకావు యిదోఁడావుకావు అని కుక్కలు నెత్తురు నాకే లాగ కొట్టేస్తాఁడఁట; అసంగతులు చెప్పుకోడానికి రమ్మంటుం డప్పుడప్పుడు.

గ:—పాపము! మీరు వెళ్ళి దానికష్టాలుతీసి వాగేస్తున్నారా? లేక దాని మొగుఁడుపోస్టు మిమ్మల్ని అందాకా చూడమందా? ఇదిగో సర్వోయి చెపుతున్నాను విను; నువ్వేమిదాఁచక్కరలేదు; అంతా తెలిసిందినాకు: జరిగిపోయిందేమో జరిగిపోయిందని, యిఁక ముందైనా బుద్ధిగా వుంటానంటే నేనిక్కడవుంటాను; లేకపోతే పుట్టింటికి వెళ్ళిపోతాను?

శం:—పో! పుట్టింటికి పోఁదలచుకుంటే? ఇక్కడ రోజూ పోరుపెట్టకు; "పోరు నష్టము, పొత్తు లాభమని" పో! ఎక్కడకుఁబోఁదలచు కుంటే అక్కడకు పో!

గ:—అబ్బ! పోతాననుకున్నావు కాఁబోలు సుఖసుఖాల! నీపరువు తీసి వీధిలోఁబెడతాను! మళ్ళీ "చాకేఁడు" గింజలు ముష్టి పుట్ట కుండా చేస్తాను మజాకా! (అని వెళ్ళఁబోవును)

శం:—అలాగా! ఆఁ! చూద్దామ దేమిటో! (అని గంగమ్మ వెడలుటఁజూచి) ఎవఁడు చెప్పున్నాఁడు చెప్పుమా యీసంగతులు దీనికి? రెండో కంటివాఁడికి తెలియదే నేను దానితో అలా...వుంటూన్న... సంగతి!

(అనుచుండఁగా మరల గంగమ్మ ప్రవేశించును)

గ.—ఏవండోయి! మీ మొగాళ్ళను ఏంజేసినా పాపములేదు. స్త్రీలు పతివ్రతలుగా వుండాలని రాశేశారుగదా అన్నిగ్రంథాల లోను పురుషులు సతివ్రతలుగాఁగూడా వుండాలని అక్కడా మాట ఎందుకు ఉదహరించలేదు? మీ మొగాళ్ళకింత పక్ష పాతబుద్ధా?

చ॥ ధరపయి ఛాందసుల్ బ్రబలి దారుణమన్మథ బాణవృష్టినిన్
బురుషులఁ ద్రోసివేయుపని ముట్లని భార్యలనెంచుచుండియా
సరణికిఁ గూడు గుడ్డలనొ సంగదురంతియొకాని యొక్కరున్
బరిణయమేమొ, దానికగు బంధములేమొ, యెఱుంగరింతయున్.

శం:—పూర్వులు వ్రాశారు ఆవ్రాఁతలు! ఈవేళ, నిన్న, వ్రాసిన వ్రాఁతలా అవి?

గ:—మీరూ అప్పలమ్మతో సంచరించుచున్నారుగదా; నేనేఅప్పారావునో చూచుకుంటే మీమనస్సెలా వుంటుందండి?

శం:—ఏ అప్పారావునో చూచుకుంటావా? ఉండు! మీనాన్న కొక ఉత్తరము వ్రాసి పారేస్తాను; అతగాఁడొచ్చినప్పుడు చెప్పేమాట "నాకూఁతురింత ప్రయోజకురాలైనదని" సంతోషిస్తాఁడు

గ:—కూఁతురింత ప్రయోజకురాలైనదని సంతోషిస్తాఁడో మానాన్న లేక అల్లుఁడింత అప్రయోజకుఁడైనాఁడని విచారిస్తాఁడో చూద్దాము! వ్రాయండి ఒక ఉత్తరము.

శం:—సరే. రాస్తానలే? పిట్ట కూతపట్టింది! ఏఁ! ఎవళ్లనిచూఁచి నేర్చుకుంటున్నావీగుణాలు?

గ:—మిమ్మల్నిఁజూసే నేర్చుకుంటున్నాను!

శం:—నన్నుఁజూసే నేర్చుకుంటున్నావా? ఉండు. నీపని జాగ్రత్తపెట్టిస్తాను.

గ:—మీపని జాగ్రత్తపెట్టిస్తాను మానాన్న వచ్చాక (అనుచుఁబోవును)

శం:—ఎవళ్ళో దీనిమతి విఱిచేస్తున్నారు! ఇదివరకెంత సేపు అది తెచ్చావు కాదు ఇది తెచ్చావుకాదని అంకెలుపెట్టడముతప్ప ఇలాటిమాట లెఱుఁగదు. ఏదోవుంది దీనికల్లా కారణము! నిదానించి చూద్దాము! (అని పోవును)

---

( తెర వ్రాలును )

## మూఁడవ రంగము

(ప్రవేశము:—సంగీతపుమేష్టరు; సుందరమ్మ పాఠము నేర్చుకొను వైఖరిని కొంతవరకుండి యాఁగి)

సం:— అమ్మాయి, నీపేరేవరు? ముఖ్యమైనముక్క అది చెప్పావు గావు?

సుం:—(లజ్జ నభినయించుచు) సుందరమ్మండి!

సం:—"అమ్మ" అనునది యిపుడు వాడుకలో లేదమ్మాయోయి? మగాళ్ళకు "అయ్య"శబ్దం యెపుడుపోయిందో ఆఁడాళ్ళకి అమ్మశబ్దం మపుడేపోయింది చూడు!

సీ॥ వేదాంతకేసరి విస్సన్నతన పేరు
విశ్వనాథమునిగఁ బిల్పించుకొనఁడె?
సంగీతవిద్వాను సాంబయ్య నామము
సాంబశివార్యుగా సర్దుకొనఁడె?
కనకాత్రి గవరమ్మ గౌరిదేవి యటంచుఁ
బేరు మార్చుకొనుట వినఁగలేదె?
సినిమానటి సరస మ్మను "సరసుభా"యని
పిల్చుకొంచునివారు పిల్వ వినమె?
గీ॥ "అయ్య"వార్లు రావులుగనో "యమ్మ"గార్లు
"భాయి"లుగనో, దేవులుగనో పరగుచుండ్రు;
"దేవి" "భాయి"నామములాంధ్ర దేశమునకు
నెరువుసొమ్ములై సనుగావు! బరువుచేటు!

సుం:—అబ్బ! ఊరుకుందురు! మీరన్నీ యిలాటిమాటలే ఆడతారు!

సం:— ఎలాటిమాటలాడాను! ఉన్నమాటాడాను! ఉన్నమాటాడితే ఉలుకెక్కువని మీయాఁడవాళ్ళ మాటెత్తానని కాదూ ఆగ్రహపడుతున్నావు సుందరం!

సుం:—అయితే నాపేరు ఎలామారిస్తే బాగుంటుందంటారు మేష్టరుగారూ మీరు?

సం:—అలా దారిలోకిరా! సుందరమ్మ అని నీకు పేరు పెట్టడములో మీనాన్నగారి వుద్దేశమేమా అని ఆలోచిస్తున్నాను. ఎంచేతనంటే, సుందరము అనగా సౌందర్యముతో నుండుట అని యర్థము తీయవలెను; లేదా, త్రిపురసుందరి అనగా శివుని భార్య, శివుడు త్రిపురాసుర సంహారకుడు గాబట్టి యతని భార్యకే పేరైన నైయుండవలెనని యొకి అర్థముతీయువలెను సరే, ఏయుద్దేశముతో నాపేరునీకు పెట్టించినను "సౌందర్య తిలకము"అని మారిస్తే కొంచెము మనప్రాముపోలికలోనికి వస్తుందేమోఅనుకుంటాను, కొంచెము నోవలిటీగా (Novelty) వుంటుంది కూడాను! ఏమంటావు నువ్వు?

సుం:—మేష్టరుగారేమి చెప్తారో చూద్దామని వూరుకొన్నాను! ఇన్ని అర్థాలు మావాళ్లు ఆలోచించారో లేదో కాని అప్పుడు, మా నాయనమ్మ పేరు సుందరమ్మంట; ఆవిడాలాబడకాలని ఆపేరు నాకు బెట్టారు!

సం:— ఆపేరు పెట్టేస్తే ఇంకా అలాబ్రతికెయ్యెడమే! అయ్యోరామ! అదికాక, సుందరం, చచ్చిపోయినవారిల పేర్లు, పుట్టినకుఱ్ఱవాళ్లకు పెట్టడము నాకొట్టె మనస్కరించదు. ఏదైనా సార్థకనామము పెట్టాలి పెట్టే! చూడు, నీకు "సుందరం" అని పెట్టారు, బలేగా వుంది పేరు! అంతేకాని, అమావాశ్యచీకటి లాగుంటుంది ఒక ఆవిడ ఆమెకు "చంద్రవదన"అని పేరు పెట్టడమెంత అసభ్యంగా వుంటుంది?

సుం:—(నగుచు) మీతో మాట్లాడటము కష్టమండీ మేష్టరుగారు

సం:—ఆఁ కష్టమే! "యథార్థవాదీ బంధువిరోధీ'యని వున్నమాటా చేస్తానసే నామీద చాలామందికిఁ గోపము!

సుం:—మేష్టరుగారు, మీకొచ్చిన సంగీతము, సాహిత్యము నాకు చెప్పిన నేర్పెయ్యాలండి, మళ్ళీ ఎలా నేర్పుతారో మీరు!

సం:—ఉన్న కాస్తకంతా నేర్పేసుకొని, సీపటము నీనెత్తిన కొట్టుకోమని ఏమన్నా అంటావన్నమాట తర్వాత!

సుం:—మంచివారే! ఏమన్నంటానా? కాదండీ! నాకు ఫిల్ముల్లో యాక్టు చెయ్యాలని వుందండీ!

సం:—మీనాన్న వూరుకుంటాడూ? గొంతుక నులిమేసి గోడవెన కాల పాతేస్తాడు ఆ కబురు తెలిసిందంటే! సంగీతము మేష్టరూ, రారా నాయనా ఎక్కడికో అని, చంపేస్తాడు అక్కడ ఒంటరిగా చూచి!

సుం:—మా నాన్నను ఒప్పిస్తానండి!

సం:—ఓ! ఒప్పించు! నిన్ను ఫిల్ముస్టారును చేసేస్తాను! ఆంధ్రదేశములో ఆడవాళ్ళలో యింతటి యాక్ట్రెస్సు లేదనిపించేస్తాను నలుగురి చేతా!

సుం:—అవును గాని మేష్టారూ, ఎవళ్లో వేశ్యలే యింతవరకు అలాంటి వాటికి సిద్ధపడుతున్నారు, సంసారులు సిద్ధపడడము లేదు; కనక ఆక్షేపణీయముగా ఉంటుందేమోయని భయము! అందులోనో, మొగుడుముగిలు పెళ్ళాము యిత్తే యేపనిచేసినా సరిపోతుంది! నావంటిదేదైనా అలాంటిపనిచేస్తే ఆడిపోసుకుంటారండీ!

సం:—ఏం! మిస్. పద్మాక్షి రామారావు ఎమ్. ఏ! వసంతసేనఫిల్ములో యాక్టుచెయ్యలే! కమలాదేవి చటోపాధ్యాయని చూడలేదు ఆస్కాలులోనే? వాళ్లిద్దరు ఎంతవంటి కుటుంబములోవాళ్లు! అవును గాని సుందరం! ఒక డవుటు (Doubt) కల్గింది అడగనా?

సుం:—అడగండి! (Doubt) డవుటెందుకు?

సం:—"మొగుడుగల పెళ్లామయితే యేమనిచేసినా సర్దుకుపోతుంద న్నావు; నీకు మేరేజి (Marriage) అయిందా; ఇంకాఅవనేలేదా?

సుం:—(సిగ్గు నభినయించి) ఆముచ్చటగూడా తీరిపోయిందట చిన్నప్పుడేనూ!

సం:—అలాగా? అయితే నీహజ్బండు (Husband)వున్నాడా ఇప్పుడు?

సుం:—లేరు, చనిపోయారట తర్వాతెప్పుడో!

సం:—(తల పంకించి) అయితే, ఆసంగతినీకుం జెప్పనేలేదా ఏమిటింత వరకెవరు!

సుం:—లేదు, నేనాసంగతి తెలుసుకుంటే, మనస్సుని పాడుచేసుకుంటానో అని మానాన్న, అప్పలమ్మముండ, కప్పెట్టేశారు. నేనే ఆఖరికి తెగించి మొన్న మానాన్నని అడిగేస్తే ఆసంగతి బయటపడింది!

సం:—అయితే నువ్వు "అన్ ఏటాచిడ్" (Unattached) అన్నమాట! very well! బాగుంది! భయపడకు! కాని, మీనాన్నను మళ్ళీ పెళ్ళిచేసెయ్యమనలేక పోయావు?

సుం:—మానాన్న "మేరేజికి" (Marriage) ఒప్పుకోడములేదు. వెలివేశాస్తారు కులములో అంటాడు. స్వాములవాళ్లు యింక మాయింటికి రారంటాడు. చాదస్తముమనిషి బాగాను!

సం:—మీదికారు, స్వాములవాళ్లు. వాళ్లు మాబాగున్నారేమి యేవం కాలేకుండా! ఒకరికి చెప్పొచ్చును యెన్నయినాకానివాళ్లు స్వంతముగా చేయడం కష్టము. ఆమధ్యను ఒకస్వాములవారు ఒచ్చాడు వూళ్ళోకి! ఆయనకందరూ బ్రిహ్మరథము పట్టేశారు! బోడమ్మలు చుట్టూకూర్చుండి జోలపాడితేనేకాని ఆయినికి రాత్రిళ్లు నిద్రె పట్టేదికాదట!

సుం:—ఆవునండి అనుకున్నారు నిజమే!

సం:—నేఁజెప్పానుగా! స్వాములవారిని మనమే వెలివేశాద్దాము! ఎవళ్ళుఁ గ్రిదూక వాళ్లు బ్రిదికేటట్లుడు స్వాములవారి ప్రమేయ మీముందరంగానునేను! స్వాములవారు కూడా గడ్డా పెట్టారా? పెద్దస్వాములవార్లమని పేర్లు పెట్టుకొని గ్లాసుగో షర్టులు, సిల్కుపంచెలు, తమలపాకులకిళ్ళీలు, బీడీలు, సిగరెట్లు కాస్తేవాళ్లు స్వాములవార్లా! నాయుద్దేశములో నొక్కవివేకానందస్వామియే హిందూదేశము గర్భము క్తి శుక్తిగాంగన్న నిజమైన స్వాములవారంతవరకు! ఖండ ఖండాంతరములకేఁగి, హిందూదేశముతసామర్థ్యము వేనోళ్ళఁ జాటిన పురుషోత్తముఁడు, మానవాతీతుఁడు, తనజాతికి, తనదేశమాతకు, యశస్సుకూర్చిన స్వామి, స్వాములవారు! నోటనుప్పు పత్రిలేక, వంశపారంపర్యముగా వచ్చుచున్న దీక్షితము నాకు జన్మహక్కు కలదని, నేనట్టి పవిత్ర వంశములోనివాఁడనని, చెట్టుపేరుచెప్పి కాయలమ్ముకొను, కపటస్వాములవార్లు స్వాములవారా?

సుం:—మేష్టరుగారూ, మీకన్నీ తెలుసునండీ ఎంచక్కానూ? మరి, మానాన్న మళ్ళీ పెళ్ళిచేయడానికిష్టపడితే నన్నుఁ జేసుకొనే వాళ్లెవళ్ళండి? మూలాగ సిద్ధపడేవాళ్ళింకొకళ్లు వుండొద్దు?

సం:—నెత్తీదానా! మీనాన్న నొప్పించు! ఎందాకానో వెళ్ళుతావు I'll Marry you

సుం:—మాటవరసకంటారు! మీనాన్నగమంతా ఒకలిపెట్టుకొని యిందులోనికి దిగుతారా! నట్టికి!

సం:—ఛీ! Damn them! నువ్వే నాకిష్టమైతే, యింక యీప్రపంచకములో నాకు ప్రియమైనవస్తువ మరొకటిలేదు! "రోమియోజూలియట్ లోలాగ నాకన్న ముందుగా నీకు మరణమా

నన్నమైతే, నీపాదాలచెంత నాప్రాణాలువిడుస్తాను! ఒకవేళనేనే ముందైతే, ఏమో నీమాట నేను చెప్పలేను!

సుం:—నామాట "డిటో"! (Ditto!)

సం:—అయితే రైటో! (Rightho!) (అని చేయిపట్టుకొని చేతిని ముద్దుపెట్టుకొనుచుండును)

( ప్రవేశము అప్పలమ్మ )

అ:—ఏటి, వూరుకే ముద్దుపెట్టుకోడమూ? ఊసులాడుకోడమేనా సదువుచెప్పడ ముందా లేదా?

సుం:—(కొంచెము ప్రక్కకు (దొలిగి) పోవేవుండ! పెద్దత్తగారిలాగ ఎప్పుడూ సాదిస్తూంటావు! ఎందుకొచ్చావిప్పుడిక్కడకు నీవు?

సం:—(తానుగూడ ప్రక్కకుఁ దొలిగి) Old bug! Nick of the moment లో వచ్చేసింది శనిగ్రహంలాగ! సుందరం? ఇదెవరు! ఇల్లంతానేనే అని తిరుగుతుంది!

సు:-అది మాయింట్లో (Servant maid) సర్వెంటు మెయిడ్! మేష్టరుగారు

సం:—"పేనుకి పెత్తనమిస్తే తలంతా చెడగొట్టిందని" యిలాంటివాళ్లె నెప్పుడూ నెత్తి కెక్కించుకోకూడదు.

అ:—ఆఁ! బేమ్మడూరికే గుండెపోతున్నాఁడు! ఏటోరినాయిన! నినతె గాక మొన్నొచ్చావునువ్వు! మాము చిన్నప్పటినుంచి, సంక నెత్తుకొని పెంచాము ఆమాత్రమాటనడానికి హక్కు లేదేమి మాకు?

సం:—హక్కు లేదనడములేదు అప్పలమ్మాయి!

అ:—మఱి రేటంటావునువ్వు?

సం:—(సుందరమ్మవైపుఁ దిరిగి) సుందరం! నేను మాటాడలేను దాని తోటి! నువ్వే ఏదోసమాధానముచెప్పి పంపించెయ్యి!

సుం:—వెళ్ళవే! తరవాత మనము మాటాడుకుందాము!

అ:—ఉఁ! ఊఁ!! నానెక్కడకెళ్ళను వల్లకాటిలోకి! గోపాలరావు బాబు పంపించాఁడు "చూసిరా సుందరమ్మ ఏంజేస్తున్నాదో" అని! ఆరు పంపితే వచ్చానుకాని, నాకేమి అవసరం మీగొడ వలోకి రావడానికి?

సం:—సుందరిమోయి! మీనాన్న పంపేడఁట! ఏంజేస్తున్నారో చూసి రమ్మని!

సుం:—నేను వచ్చేస్తున్నాను అని జెప్పవే! నువ్వుపో! నాన్నతో నేనే మాటాడతాను!

అ:—ఆఁ! శేమ్మఁడు! మాచెడ్డరోస మొచ్చేసింది! రోసము! (అనుచుఁ బోవును)

సం:—సుందరం! మఱి, మీనాన్నపిలిచి, హార్మోనియ మెక్కడా వినిపించడములేదు, మేష్టరుగారేమి చెప్తున్నారంటే ఏమి సమాధానము చెప్తావునువ్వు?

సుం:—నేనేదో చెప్తాగా! మీకెందుకాభయము! మీరు హాయిగా యిక్కడే కూర్చోండి! నేనిప్పుడే వచ్చేస్తాను (అనిపోవును)

సం:—(కూర్చుండియుండి) ఆహా! ఏమి యీమె సౌందర్యము!!

ఉ॥ పున్నమచంద్రుఁ గేరు నగు ♩ మోము మలీమసమయ్యె ప్రేమసం
పన్నతలేమికాదె! రవి ♩ నర్మయొనేఁడు సజీవుఁడైన యీ
యన్నుఁ మిన్న రూప పట ♩ మచ్చము గాలిఖియింపలేఁడు నే
నెన్నఁడుగూడుదున్ సుదతి ♩ నెట్లు గ్రహింతును పత్నిగా భువిన్!

(తెరపడును)

———

— ద్వితీయాంకము —

# నాలుగవ రంగము.

(ప్రవేశము:- వెంకటరెడ్డి)

( శంకరమింటిసమీపము వ్రాలియుండిన తెర ముంగిట )

వెం:— గుద్దుకి సంపేస్తాను శంకరంగాఁడు కనబడితే! ఎదవ! పెద్ద పెండికట్టు లెడ్తాఁడు! బిళ్ళగోసీ యెడ్తాఁడు! ఏమోఱఁగనట్టు ఒంకోంక దండాలెట్టుకుంటూ బ్రతుకొస్తున్నా డేదవబ్రతుకు! ఛీ! ఏం బ్రదుకు తీయవయ్యా! ఆళ్లు, యీళ్లు యిసుకుంటూ యిన్ని బియ్యప్పుసూకలు ఎట్టింగే ఎగ్గి గంజితాగుకొని బతుకుతున్నాఁడు. ఈఁడికీ యిద్దరుపెళ్ళాలోకటో! మొదటిపెళ్లానికి పిల్లలు పుట్టలేదని గొడ్డుముండని ఆయమ్మని ఆమహాయిల్లాలిని ఒగ్గేసి, యీపెళ్ళాన్ని పెళ్ళిచేసుకున్నాఁడు. దీనికి మాత్రము పిల్ల లేరీ! ఇదీ గొడ్డుముండే! ఏటి భగమంతుఁడియ్యాలికాని, పిల్లల్ని కనడము మన తెలివితేటలే? ఆళ్లు గొడ్డుముండలంటే నానొప్పుకోను! ఈఁడు గొడ్డెదవ! బేమ్మనాత్తాలికెల్తాఁడా! కాపీతాగకుండా ఎల్లేవాఁడు! సాయింత్రము, పెతీరోజూ, గుళ్ళోకూకోని పేకాడ్తాఁడు, దీపాలెడ్తే "జయ్ సీతారామ్" అంటాఁడు. ఇలాటోఁడు ఒకటోరకము బేమ్మఁడు. మరేద సెయ్యాలీడిని! శూద్రపోళ్ళ నంటుకొంటే, తానాలుచేస్తారుకందా బేమ్మరులు, అలాటోణ్ణి శంకరంగాఁడుని కులంలో ఎందుకుంచారు? ఈఁడు రోజురోజుకి నాఆఁడదాయితో ఊసులాడుతున్నాఁడంట! నానూ సూసేను ఒకపాలి! ఏంటేవు ఆ బేమ్మఁ డూసులాడుతున్నాఁడంటే, ఆనంజకూతురు, గోపాలరావు బాబుగారి అమ్మాయి సుందరమ్మ సంగతి ఏదో అడగడానికొచ్చాఁడని బొంకేసింది!

కాబోసునని, నానెల్లిపోయాను! ఏటీ, రోజూవచ్చివుాసులేనంట! మొన్న మామేస్త్రి చెప్పేండు! ఏటిరా అందుకునేబేమ్నండు మీాయాండదాయిలో మహామాటలాడుతున్నండు కూయాల పనిలో అందఉానాకు తాటాకులు గట్టడమే కనబడనీ పులుసులో కెముక లేకుండా కొట్టేస్తాను (అనుచుండ)

( ప్రివేశము :— గంగమ్మ )

గ:— ఏం! వెంకటరెడ్డి! ఇలాగొచ్చావు? ఈవేళ పనిలోకి వెళ్ళలేదేమి?

వెం:- నామాట సెప్తానుకాని మొనకనుంచి, నీమొగుడింట్లో వున్నాండా! లేండా? చెప్పమ్మా!

గ:— అదేమిటోయి! అలామాటాడుతున్నావు! ఎప్పుడూలేనిలాగ!

వెం:— ఎప్పుడూలేని సంగతే ఒకటొచ్చిందిపుడు! చెప్పవమ్మా నీమొగుండెక్కడున్నాండో!

గ:— ఆయనిలాటప్పుడి ట్లో వుంటారా? నీకు తెలియదు, వెంకటరెడ్డి!

వెం:— ఏంటి తెలడము వూరుకోవమ్మా! ఆండెక్కడుంటాండో సెప్పవమ్మా! నీకు దండమెడతాను!

గ:— అబ్బే! ఇంట్లోలేరోయి! పైమీాంద గుడ్డవేసుకొని ఇప్పుడేవెళ్లారు వీధులోకి! మఱి, యెక్కడకువెళ్ళారో యేమిటో! చెపుతారా ఏమైనానా! ఫలానిచోటికి వెళ్తానని!

వెం:— అబ్బె సెప్తాండు! అక్కడకెళ్తానని యిక్కడకెళ్తాండు. ఇక్కడకెల్తానని అక్కడకెల్తాండు. నిలువంతా యిసమే ఆండికి!

గ:— ఏమి! ఏమొచ్చిందిపుడు? అయ్యగారూ, నువ్వు మొన్నటిదాకా నేస్తమేకాదోయి వెంకటరెడ్డి?

వెం:— ఏంనేస్తము తీయవమ్మా! ఏంటో బేమ్నండు, కూంత మంచీచెడ్డా

చెప్తాఁడు అని రోజూ గుప్పేఁడు గింజలేస్తుంటే ఆఖరికి నాఆఁడదాయి మెడలిరిసేశాఁడు!

గ:—అలాగా! నాకుఁదెలియనే తెలియదోయి ఆసంగతి!

వెం:—అవును మీకెలా తెలుస్తుంది! ఆఁడు సెప్పేఁడుగందా!

గ:—సరే! వెంకటరెడ్డీ, నువ్వు వెళ్ళిపో యిప్పటికి! అయ్యగారు ఒచ్చాక నేను మందలిస్తానులే ఆయిన్ని!

వెం:—నువ్వు మందలించడమేమిటమ్మా తల్లీ! నానే మందలిస్తాను. బుఱ్ఱ రామకీర్తనలు పాడించేశాస్తాను!

గ:—నాముఖమైనా చూడవు వెంకటరెడ్డీ! ఆయిన్నలా చేసేస్తే, నా గతేమిటవుతుంది తెలియదు నీకు!

వెం:—నీకేమమ్మా! నువ్వొల్లకోవమ్మా! నానాఁడికి బుద్ధిచెప్తాను!

గ:—అలాకాదు! నాసోదరుఁడులాటివాఁడవు! ఆయిన్ని కాపాడాలి నువ్వు!

వెం:—ఏంటి తియ్యావమ్మా! నీమొగుడ్ని నువ్వు మంచిమార్గములో పెట్టుకోవాలికాని, ఒకళ్ళనంటే యేమి ప్రయోజనము? నానాఁడినొగ్గను ఎయ్యిసెప్పు లచ్చసెప్పు! (అనుచుఁబోవును)

గ:—మెల్లగా వెంకటరెడ్డి చెవిలోకూడా పడిందన్నమాట మాఆయిన వ్యవహారము! మెల్లిమెల్లిగా యింకా పాక్కుపోతుంది! ఆతరవాత ఆయినవాళ్ళకీ కానివాళ్ళకీ తెలిసిపోతుంది. అప్పుడు నలుగురూ గడ్డిపెడ్తారు. అందుకనే, యిన్న నేనే చెప్పిచూద్దామని ఆప్రశంస ఎత్తితే మాఆయన పోట్లాటకొచ్చాఁడు! సరే, నాకెందుకని నోరుమూసికొని వూరుకొన్నాను. ఇప్పుడాఖరికి వెంకటరెడ్డికి తెలిసిందా? అతను వూరుకోఁడు! నేనాపమిటి వూరుకోడానికి! (అనుచుండగా)

( ప్రవేశము :—శంకరం )

శం:—ఏమేవు! "నేనావిమిటి వూరుకోడానికి" అంటున్నావేమిటి!

గ:—ఏముంది! మీ నేస్తము, అప్పలమ్మ మొగుఁడు, వెంకటరెడ్డి ఇప్పుడే మీ రెక్కడున్నారంటూ వెదుక్కుంటూ వచ్చిపోయాఁడు!

శం.—ఏం! ఏంకావాలి అతనికి? ఏదైనా ముహూర్తము పెట్టించు కొందుకు వచ్చాఁడా?

గ:—మీకే ముహూర్తము పెట్టెయ్యడానికి వచ్చాఁడు నేను కాళ్ళా కడుపూ పట్టుకొని పంపేశాను. ఇప్పుడే యీదారిని అతఁడెళ్ళాఁడు. మీరీదారిని వచ్చారు. దారిలో తారసపడలేదుకద?

శం:—లేదు. నాకు ముహూర్తము పెట్టెయ్యడమేమిటి? నీమాట నాకేమీ అర్థంకాలేదు!

గ:—అవును! అర్థంకాదు! మీరు అప్పలమ్మతో తిరుగుచున్న, సంగతి అతనికెవరో చెప్పారఁట! బుఱ్ఱ బద్దలగొట్టేద్దామని మీకోసము వెదుక్కుంటూ వచ్చాఁడు.

శం:—(ఇంచుక నాలోచనా నిమగ్నుఁడై) ఆలాగా! ఏడిశాఁడు వేళ్లవుల వెధవ! వీఁడిని పుట్టించినఁవాడు దిగిరావాలి నావంటిమీఁద చెయ్యి వేయడానికి!

గ:—ఏవిటూ బడాయి! చేసింది తప్పువనని సిగ్గు తెచ్చుకోక, నేనూ మునిషినే అంటూ మాటాడతారేమంట!

శం:—ఏవిటూ తప్పువని! నేను వాఁడిపెళ్ళాముతో మాటాడుతున్నానని చూసిన సాక్ష్యముండొద్దా! నిదర్శనముండొద్దా!

గ:—ఏమో మీ సాక్ష్యాలునిదర్శనాలు ఎవరికి కావాలి! వాఁడికి బాగా కడుపు మండివుంది. ఏరాత్రివేళో, చీఁకటిలో, బుఱ్ఱమీఁద ఒక

కట్టిపెట్టు చెప్పడంటే మళ్ళీ కబురూ, కాకరకాయా ఉండదు.

కం:—పోలీసు ఇనస్పెక్టరుగారు నాకు స్నేహితులు. వారితో నీమాట కాస్త చెప్పానంటే వెధవని తీసుకెళ్ళి పంజరములో పాడేస్తారు. దానితో రోగము వదలుతుంది.

గ:—సరే! అలాటిదేదో చూసుకోమ్మనే చెప్తూంట! లేక, అప్పలమ్మ స్నేహమైనా మానుకోవాలి? లేకపోతే, వెంకటరెడ్డి, ఏరాత్రి వేళనో "బడితెబాజా" పట్టేస్తాడు. చెప్తున్నాను. మీ ఇష్టము (అని పోవును)

కం:—వ్యవహారాలన్నీ తల్లక్రిందులై పోతున్నాయి. ఈగొడవ ఇప్పుడెలా బయటకెళ్ళింది చెప్మా! వెధవ "మకపోతు గాంభీర్యము" కబుర్లు చెప్తానుగాని మాఆవిడతో, నాకేమీ గుండె నిబ్బరము లేకపోవుచున్నది. వెంకటరెడ్డిచాలాచెడ్డవాడు. కేవలము చెడ్డవాడు కాడుకాని పట్టుదలమనిషి! ఎవళ్ళో కిట్టనివాళ్లు వాడిచెవి కొరికారు! వాడాపళంగా వీధిని పడ్డట్టున్నాడు. సరే చూద్దాము! ఓర్చిన పసరానికి తేటనీరన్నారు! కొన్నాళ్ళదాకా, వీధిలోకి తిరగడానికి వెళ్ళను. ఏదో వూరు వెళ్లాడని చెప్పెయ్యమంటాను మాఆవిడతో! ఆతరవాత సంగతి చూద్దామటుపైని! (అనిపోవును)

( తెర లేచును.)

---

అయిదవరంగము.

(ప్రవేశము—గోపాలరావుగారు)

ప్రదేశము : గృహాంతర్భాగము.

గో:—నాకు "అమ్మాయి" చదువు ఎలా పరిణమిస్తుందో ఆఖరకి తెలియడములేదు. ఏమునలాడినో, ముసిలాడినో తెచ్చిపెట్టాము; కళ్ళనీళ్లు తుడుద్దామనుకొంటే, పడనిస్తుందా, మేష్టర్ని కుదిర్చినదాఁకా పొడుచుకొనితినేసింది. ఒక్కగాని ఒక్కపిల్ల, అందులోనూ యీఅవకాశం ఒకటివచ్చింది, మనస్సేమి నొచ్చుకొని, ఏమిబెంగపెట్టుకొంటుందోఁఅని, సరేఅన్నాను. వీఁడెవ్వఁడో, యీసంగీతంమేష్టరు దాఁపరించాఁడు. వీఁడెంతసేపు నాటకపు పద్యాలు; సినీమాపాట్లు, చెప్తున్నాఁడుకాని "రామాకృష్ణా" అన్నమాటింతవరకువినలేదు. మూఁడొంతులముప్పాతిక బాతాకానీ పెట్టుకొని కూర్చుంటారు. మేమెవ్వరమైనా ఒస్తూన్నటు పసిగట్టేఁవుడు, కాస్త "కుయికుయి" మనిపిస్తారు. లేకపోతే యింక వాళ్లసొరణివాళ్ళదే! ఏమి అనడానికి వీలులేదు. నోటి పంకెళ్లువచ్చాయి (అనుచుండగ)

(ప్రవేశము : వేంకటరెడ్డి)

వెం:—గోపాలరావుబాబుగారు! దండాలండి!

గో:—ఉపస్థితార్థసిద్ధిరస్తు! ఏమోయి! వేంకటరెడ్డి యిలావొచ్చావు? అప్పలమ్మకోసమా!

వెం:—కాదండి, శంకరంగాఁడొచ్చాడండి మనింటికి?

గో:—శంకరంగాఁడంటే ఎవరో నాకుఁదెలియడములేదు. ఎవరతను?

వెం:—ఆ ఆఁ! ఆ, అదుక్కునే బేమ్మఁడండి!

గో:—ఎవరు, మనశంకరమా?

వెం:—అవును. అండేనండి !

గో:—అదేమిటోయి, పదుత్తో నేపట్టుకొని శంకరంగాడంటావు ? శ్రోత్రియుమైన బ్రాహ్మణుడిని !

వెం:—అందు షోత్రియమైన బేమ్మడాండి పంతులుగారు ! సరే, ఎందుకులెండి ! ఎలాగా బ్రేమ్మర్లూ బేమర్లూ ఒకటే !

గో.—ఏమి ! వెంకటరెడ్డి ! అతనిపనేమివచ్చిందినీకు ?

వెం:—అందు నాపెల్లాముతో తిరుగుతున్నాడటండి ! ఆసంగతి యేమి టోకనుకోవాలిప్పుడు !

గో:—ఆఁచ్చే ! అలాగుంటుందా! వట్టిదోయి! ఎవళ్ళోకిట్టనివాళ్ళు చెప్పినమాటఅది!

వెం:—ఏంకిట్టనివాళ్ళు తియ్యండి! మాకులపెూళ్ళుచెప్పిన మాటేనది !

గో:—అతనికేమి పెళ్ళాములేదా? ఒకరుకాదు యిద్దరుపెళ్ళాలుగదా!

వెం:—ఏంటి? పెళ్ళాలులేకేనేటండి యీ తిరిగేవాళ్ళంతా తిరుగుతుంట!

గో:—అవునులే! కాని, నిజమైయుండదోయి !

వెం:—అబ్బ! నానత్తెపెమాణపూర్వకంగా, యినండి సెప్తున్నాను. నిజమేనటండి !

గో:—అయితేగావచ్చు! ఇపుడుచాలామంది వంటబ్రాహ్మణులు వాళ్ళు కొందరలాగేవుంటున్నారు. కాని వాళ్ళు పెళ్ళీ, పెడాకులులేనివాళ్ళు! మరి యితనికేమిపొయ్యేకాలమో! ఎద్దులా పెళ్ళాముండియింట్లో!

వెం:—అయమ్మను వంచలేడండి! ఇంట్లోపెళ్ళాల్ని ఒంచలేక, యీధులోముండల కానపడేవాళ్ళని ఎఱుగరటండిబాబుతమరు !

గో:—ఎఱుగకేమి! పట్నవాసమిది! అన్నిజాతులమనుష్యులు వుంటారు.

వెం;—మరియింకేం! అన్నితెలుసుండే అడుగుతారుబాబుగారు !

గో:—శంకరం రెండుమూఁడు రోజులపట్టి కనబడడము లేదోయి ఏం చేతో కాని!

వెం:—ఏంచేతో కాదండి! ఇదిగోయించేత! నానుకాస్తున్నాని ఎవఁడో ఉసారిచ్చేశాఁడు, ఆఁడెక్కడకో పిట్టయిపోయాఁడు.

గో:—పోనీ! అప్పలమ్మనే మందలించలాకపోయావా చాటుమార్గంగా!

వెం:—చాటుమార్గంగాగాదండి, పబ్లీకంగా మందలిస్తానండి తర్వాత, ముఁదు శంకరంపని పట్టెయ్యాలండి!

గో:—తొందరపడేవుసుమా! బ్రాహ్మణుని హింసించినపాపము ఎన్ని జన్మలెత్తినాపోదు.

వెం:—అది యిప్పుడమలులో లేదండి! బాబూ, సెలవు! (అనిపోవు చుండును).

గో:—చూడు! వేంకటరెడ్డి! పోనీ, నేను శంకరానికి కబురు పంపించి, ఇందేమిపని అని నాల్గుచివాట్లుపెట్టనా?

వెం:—మీకెందుకుబాబు! మీరేమి యెఱగనట్టూరుకోండి! నా నాఁడిసంగతి జాగ్రత్తపెట్తాను. (అనుచుండగా)

(ప్రవేశము : సంగీతపుమేస్టరు)

సం:—(వచ్చి యొకకుర్చీపైఁ గూర్చుండును)

గో:—ఏమండీమేస్టరుగారు, ఈవేళకు పాఠమైపోయిందా యేమిటండి

సం:—ఆఁ! అయిపోయిందండి! ఇంటికి వెళ్ళిపోవుచున్నాను.

గో:—అమ్మాయివ్యవహార మెలావుంది? ఏమైనా దారిలోపడిందా? లేదా?

సం:—ఓ! దివ్యంగాపడిందండి!

వెం:—(గోపాలరావుగారి నుద్దేశించి) బాబుగారు! అమ్మాయికి మేస్టరుగార్ని ఎట్టారంట! ఈయనాండి ఆయన?

గో:—అవునోయి వెంకటరెడ్డీ!

వెం:—బాబూ, ఈఅయ్యోరు శంకరానికి సుట్టమంట; ఈయన్నడిగితే తెలుత్తాదేమో ఎక్కడకెల్లాడో?

గో:—ఎవరుచెప్పారు చుట్టాలని?

వెం:—మీగులాపది సెప్పిందండి ఒకపాలి!

గో:—కావచ్చు! అయిన్నేఅడుగు తెలుస్తుంది.

వెం:—బాబు మేట్టరుగారు! తమపేరు తెల్దు! ఏమనుకోకండే!

సం:—ఏవిటి! ఏమికావాలినీకు?

వెం:—శంకరం ఏమవుతాడండిమీకు?

సం:—చస్తే దెయ్యమవుతాడు!

గో:—(నవ్వుచు) ఏదో అవుతారన్నాడే శంకరం మొన్న! మావాడు మావాడన్నాడు మాటలసందర్భములో చాలాసార్లు.

వెం:—అలాగండి! (అని తానుగూడ నవ్వును)

సం:—అబ్బే ఏమీఅవడండి! పాటివాడు; వాళ్ళువెళ్ళాల్లే; మేమూ వెళ్ళాట్లమే! కాని, ఫలానివారియింట్లో మేష్టరుకావాలి, ఆ యుద్యోగము నీకిప్పిస్తాను; నువ్వు నాకేమి యిస్తావని వరుగెత్తుకొచ్చి నన్నడిగాడు. నౌకరీలేక చాలా యిబ్బందిపడుతున్నానప్పటిలో. కనక ఏదో నీతాంబూలపుఖర్చుకు నీకిస్తాలే శంకరం అన్నాను. అంటే అలాకాదు, ఇంతని నోటితో అనెయ్యమన్నాడు. మనకుద్యోగమవడమే ప్రధానమనుకొని, మొదటినెల జీతమిస్తానన్నాను. సరేనని వప్పుకున్నాడు అప్పటికి!

గో:—అయితే మొదటినెలజీతము మీరింటికిపట్టుకెళ్ళలేదన్నమాట!

సం:—అవునండి! అంతటితో తృప్తివుండాలాండి!

వెం:—చూశారండి! ఎలాటివాడో! అబ్బే! నోరుమాటాడుచుంటే నాసలు ఎక్కిరిస్తూంటాయండి ఆడికి!

సం:—రెండవనెలజీతముకూడా యిచ్చెయ్యమన్నాడండి! చూడండి, ఏమిన్యాయముగావుందో!

గో:—ఏమిచేస్తున్నాఁడీడబ్బంతాను? పిల్లలమెడలో తెగ్గింపితే నల్ల పూసలతాళ్ళుతప్ప మరేమీలేవే!

వెం:—పేకాడతాడండి! ఎవరైనా పేకాడుతుంటే, ఆదారిని శంకరం ఎల్తున్నాఁడంటే ఆఁడికి పందిఎంటికలు బిగుసుకుపోయినట్లు బిగుసుకుపోతాయండి ఎంటికలు! ఇఁక అన్న మక్కరలేదు; నిద్రక్కరలేదు. పేకాటుంటే! తరవాత "టువ్వు" కూడా కొట్తాడండి!

గో:—గెలుస్తాఁడా ఎప్పుడయినా?

సం:—అబ్బే! గెలుస్తుంటే, డబ్బుకేమి లోటుండండి?

గో:—ఓడిపోతూంటే ఎప్పుడూ, మళ్ళీమళ్ళీ ఎలాగాడబుద్ధిఅవుతుందో అతనికి!

వెం:—ఇంకోపాలిసూద్దాము; మరోపాలిసూద్దామని ఒట్టుకెళ్ళవడబ్బంతా జమకట్టేసి ఒచ్చేస్తాఁడండియింటికి!

గో:—నాకుఁదెలియదు శంకరంసంగతి! చాలాపెద్దమనిషి అనుకునే వాణ్ణినేను.

వెం—అలాగే కనబడతాఁడండి! దొంగా మనిషిలాటివాఁడేనండి!

గో:—అవును నిజమే!

సం:—(లేచినిలువఁబడి) పంతులుగారు, సెలవా?

గో:—శుభం! వెళ్ళిరండి! (సంగీతముమేస్టరుపోవును)

వెం:—బాబు, నాను సెలవుతీసుకొని ఎల్తానండి.

గో:—వెంకటరెడ్డి! ఇదిగో! నీక్షేమంగోరి చెపుతున్నాను. గొడవల్లోకి దిగకు!

వెం:—మీరుసెప్పవలసిందే, నాను వినవలసిందేబాబు! (అనిపోవును)

(తెర పడును)

ఆఱవరంగము.

(వ్రాలియుండిన తెరముంగిట).

(ప్రవేశము : సంగీతపుమేష్టరు, వెంకటరెడ్డి.)

వెం:— బాబు ! మేష్టరుగారు ! శంకరరంగాఁడు మీాకు సుట్టముకాదు గదాండి !

సం:— కాదోయి ! కాదని చెప్పానుగా పంతులుగారికొదట !

వెం:— అయితే తమరు నాకోవుపకారముసెయ్యాలండి !

సం:— ఏమిటదిచెప్పు. చెయ్యతగ్గదైతే చేస్తానంటాను. లేకపోతే చెయ్యలేనంటాను.

వెం:— తమరు సెయ్యతగ్గదే !

సం:— చెయ్యతగ్గదైతే చేస్తానంటాను అనిచెప్పేగా!

వెం:— శంకరరంగాఁడు ఎక్కడుంటాఁడో సెప్పాలండినాకు?

సం:— నాకేమి తెలుసును ఎక్కడుంటాఁడో! ఎక్కడెక్కడకి వెళ్ళు తాఁడో నాతోచెప్పిగాని వెళ్ళుతాఁడా ఏమైనానా ?

వెం:— కాదులెండి! తమకేమైనా తెలుసునేమో అని అడిగాను.

సం:— నాకుఁదెలియదు! (అనిపోవఁబోవును).

వెం:— బాబుగారు, మరోకమాట!

సం:— ఏమిఁటది? చెప్పుత్వరగా! నాకుఁజెవులుఘుళ్ళుపడుచున్నవి. ఇంకా భోజనముచేయలేదు.

వెం:— పోనీ, భోంచేసాక, తమదర్శనంచెయ్యనా?

సం:— ఎందుకు? నావల్లజరగవలసిన పనియేముందినీకు?

వెం:— శంకరంగాఁడెక్కడుంటాఁడో పట్టుకొనినాకు కూంతమాటచెప్పాలండి !

సం:— పోవోయి! పెటిక్రుదిరింది తోఁకలితలకు చుట్టమని "నేను నీకు

సణ్గొంటునా? నాస్తేటనుపమిటి? నీస్టేటనుపమిటి? (అనిరివ్వున పోఁబోవును).

వెం.—సరే, ఎల్లు, ఎల్లవయ్యా! నీసంగతంతానాకు దెలిసిందిలే!

సం:—(వెనుకకువచ్చి) ఏం తెలిసింది నాసంగతినీకు? కొంచెము చెప్పమ్మా!

వెం.—ఇంకేటి తెలియాలి? ఆమొదవపిల్లను సెరిపేశావు కాదూ నువ్వు? ఉండు, గోపాలరావుబాబుగారితో సెప్పేస్తాను యిప్పుడే ఎల్లి.

సం:—నువ్వు చెప్పేస్తే ఆయన నమ్మేయ్యడమే! ఏం జెరిపా నా అమ్మా యినినేను? చదువు చెప్పుతున్నాను అంతేనా?

వెం:—సదువు సెప్తున్నావో గిదువు సెప్తున్నావో ఎవడికి తెలుసును? ఎల్లవయ్యా! పోనీ, నమ్మకపోతే నమ్మరు! నమ్మితే నమ్ముతారు నీవెల్లవయ్యా!

సం:—ఇదిగో, పాపపుమాటలు ఆడుకోవద్దు! జాగ్రత్త!

వెం:—పాపపుపనులు చేస్తే రాదు పాపము! నానంటే బస్తదికాదు. సరే నాను పాపాత్ముఁడనే! నువ్వు పుణ్యాత్ముఁడవు. ఎల్లు! ఎల్లు! (అని వెంకటరెడ్డి కోపముతోఁ బోవును.)

సం:—ఈ ముండావాఁడి నోటిలోఁ బడిందికూడా నుదేముఁడా! వీఁడికి వీఁడి పెళ్ళాము ఆ అప్పలమ్మముండ చెప్పివుంటుంది. దానినోటిలో నువ్వుగింజ దాగదు. ఇపుడేమిటి కర్తవ్యము? వెంకటరెడ్డి వెళ్ళి గోపాలరావుగారితో నిజంగాఁ జెప్పేశాఁడంటే, నేనీ గ్రామములో వుండలేను. వెంకటరెడ్డితో వెళ్ళి శంకరం ఎక్కడుంటాఁడో చెప్పేస్తే వాఁడ్నివాఁడు మాటదక్కించుకుంటాఁడు అపుడు ఆహత్యాదోషము నా మెడఁజుట్టుకుంటుంది! ఏమి సేయవలయు నిట్టియెడల? (ఇంచుక నాలోచించి) సరే, ఏదియెట్లున్నను త్వరితముగా వెనుకకుబోయి నాసౌందర్యతిలకము నొకసారి చూచి విషయమంతయు మాటాడి మరియు నింటికిఁబోయెదను. (అని పోవును). (తెరలేచును).



# ఓ స్త్రీ డాక్టరు.

## తృతీయాంకము.

---

### ఏడవరంగము.

(ప్రవేశము : సుందరమ్మ.)

(ప్రదేశము : గృహాంతర్భాగము).

సుం:—నిజంగా ఆఁడది సుఖపడాలంటే మగవాఁడివల్లే! తల్లీ తండ్రీ వుంటే అచ్చటలు ముచ్చటలూ తీరుస్తారుగాని, యింకేం చెయ్య గలరు వాళ్ళు? మఱి, భర్త అలాకాదు, భరిస్తాఁడు అన్నివిధా లాను! ఇంకభర్తలేనిభార్యగాని, భార్యలేని భర్తగాని, చచ్చినా వకటే బ్రదికినావకటే!

సీ॥ పూవులుంచుకొన నీ • వు సువాసినివా తల
వెండ్రుకల్ శగవను • తండ్రులుండ;
కుంకుమఁదాల్చిన • ఘోరపాపమగు, వి
ధవకు బొట్టేమియన్ • దల్లులుండ;
గాజులు, కడియాలు • గతభర్తృకల కథ
ర్మము దాల్పనను నత్త • మామలుండ;
ధవళవస్త్రింబె, వి • తంతవుఁదాల్చువ
స్త్రమనిశాసించు సి • ద్ధాంతులుండ;

సీ॥ ఆఁడుబిడ్డల నీకఁ గాంచ • కమ్మ భరత
మాతరో! కాంచి చేసి • మహిమనస్వరూప
దన్యదేశాలపరిజలు వో • స్వ్యాస్పదంబు
నలుపుచుండిరి స్త్రీలకు స్వేచ్ఛ • కలుగకుంట!

"గుడ్డిలోమెల్ల" అనునట్లు నావ్యవహారము కొంచెము నయమే! మానాన్న, ఏమాటకామాటే అనుకోవాలి, ధర్మరాజులాటివాఁడు. అసలాసంగతి చెప్తే నేనేమి బెంగపెట్టుకుంటానోయని మొన్నమొన్నఁటిదాఁకా ఆప్రశంస ఎత్తనేలేదు. ఉండఁబట్టలేక, నేనే కదిపితే, అవళంగా, ఏకరవు పెట్టేశాఁడు ఉన్నసంగతంతా!

(ప్రవేశము : సంగీతపుమేష్టరు)

(హడావిడిగా వచ్చి)

సం:—సుందరమ్మాయి! కొంప మునిగేలాగుంది! ఇప్పుడు!

సుం:—(ఆశ్చర్యమభినయించి) అయ్యో! ఏమిటది? మేష్టరుగారు! చెప్పండి త్వరగా!

సం:—చెప్పడానికల్లా ఏముంది! ఆవెంకటరెడ్డి, అప్పలమ్మమొగుఁడు, తన పెళ్లాముతో శంకరము తిరుగుతున్నాఁడని, ఆశంకరాన్ని బాజా పట్టేద్దామని వలవేసి తిరుగుతున్నాఁడు. ఆ శంకరమెక్కడికో పాటిపోయినట్టున్నాఁడు. ఆ వెంకటరెడ్డి పిచ్చికుక్కలాగ తిరుగుతున్నాఁడు. ఇందాఁకవచ్చి మీనాన్నగారితో మాటాడుచున్నాఁడానంగతే! నేనింటికి పోతూపోతూ—బాపుండమ్మా మీనాన్నగారెదర వుంటుండగా చెప్పకుండా వెళ్ళిపోవడమెందని సెలవు పుచ్చుకొని వస్తానని వెళ్ళిపోవుచున్నాను. వెంకటరెడ్డి కూడా సెలవండి పంతులుగారని నన్ను వెంటాడి, ఆశంకరంగాఁడెక్కడ

దొరుకుతాఁడో చెప్పమంటాఁడు. నాకుఁ దెలియదు బాబోయి అంటేవినఁడే! ఆఖరికి ప్రాణమువిసుగొచ్చి "పోవోయి పుల్లయ్యా" అన్నాను. ఆమట్టుకి వాఁడికి కోపమువచ్చి "సరే వెళ్లు నీసంగతి జాగ్రత్తపెట్తాను." పంతులుగారి అమ్మాయితో నీవు తిరుగుతున్నావు; ఆసంగతి పంతులుగారితో చెప్తానుండని" అన్నాఁడు. నాకేమీ పాలిపోక యేవో రెండుమూఁడు మాటూలుమాటలాడేసి చక్కావచ్చేశానిక్కడికి ఆఖబురు నీ చెవులోవేద్దామని! మఱి, ఏమిటి ముందుసంగతి?

సుం:—ఎవరు చెప్పేరుచెప్మా అతగాఁడికాసంగతులు?

సం:—ఇంకెవ్వరు! మీరు నెత్తినెక్కించుకుంటున్నారు! ఆముండే!

సుం:—అప్పలమ్మముండా?

సం:—అవును అదే!

సుం:—అబ్బే! అది అలాంటిదికాదు! నన్నుఁ జిన్నప్పటినుండి చంకనెత్తుకుని పెంచింది. నాచిన్నతనంలో అదీ అట్టే పెద్దదికాదు. ఒక చిరిగిపోయినపరికిణీ, చాలీచాలని రవికొకటి, జర్మనీసిల్వరు కడియాలు, పెట్టుకొని వస్తూండేది నన్నెత్తుకోడానికి! మానాన్న భోజనముపెట్టి నెలకు 2-0-0 ఇచ్చేవారు. తరువాత, తరువాత, క్రిమంగా పెద్దమనిషయింది. మానాన్నగారే దానికెవ్వరులేరని ఖర్చులన్నీపెట్టుకొని వెంకటరెడ్డికిచ్చి పెళ్ళిచేశారు.

సం:—ఈముండావాఁడెలా తటస్థపడ్డాఁడు? చెప్మా!

సుం:—వెంకటరెడ్డి మాయింట్లో అప్పుడు వంటెద్దుబండి తోలుతూ వుండేవాఁడు. తరువాత మాఅమ్మ పోయాక విరక్తిచేత మానాన్నగారాబండి అమ్మేశారు. నీవేదోపని చూసుకోవోయి అని వెంకటరెడ్డికి చెప్పేశారు. అప్పటినుంచి మాయింట్లోలేఁడు. లేకపోతే మాయింట్లో వుండేవాఁడే! ఇప్పుడేదో మూఠల పని

లోకి పోతున్నాఁడు కాఁబోలును ! ఇప్పటికి ఏదో అవసరంవచ్చిం దనిచెప్పి అప్పుడప్పుడు నాన్నగారిదగ్గర ఒకటి రెండురూపాయలు పట్టుకు పోతుంటాఁడు.

సం:—సరే, అంతా బాగానేవుంది కాని, మీనాన్నగారితో మనమిద్ద రము ఇలా వుఁటున్నామన్న సంగతి చెప్పేస్తాఁడు. అప్పుడేమిటి జరగవలసింది ?

సుం:—ఒక్కనాఁటికిఁ జెప్పఁడు !

సం:—ఓసి పిచ్చిదానా ! అలాటివాళ్ళకి నీతేమిటి జాతేమిటి ? విశ్వాస మేమిటి ?

సుం:—వాళ్ళలోనే నీతిపరులుంట ! ఒక మూటలపనివాఁడు ప్రతి రోజూ స్నానముఁజేసి, యీశ్వరాలయములో దేముఁడిని దర్శిం చుకొని మరీ పనిలోనికిపోతుంటాఁడు. వానరానీ, వరదరానీ, అతని దినచర్యలో యీకార్యక్రమముఁదప్పదు.

సం:—కుమ్మరావములలో ని త్తడిముంతలుండునా ? సరేకానీ, నీయిష్ట ముతో నేకీభవించక తప్పదు.

సుం:—ఏమి-గులకరాళ్ళలో మంచిముత్యాలుండేటప్పుడు; కుమ్మరావ ములలో ని త్తడిముంతలుకూడా వుండవచ్చు !

సం:—సరే అన్నాగా ! మఱి, ఒకవేళ, కీడెంచి మేలెంచుకోందము ! వెం కటరెడ్డి మనమాట మీనాన్నగారితో చెప్తాఁడనుకో ! అపుడే మంటాడు మీనాన్న ?

సుం:—ఏమంటాఁడు మానాన్న! ఏవో రెండు కూఁకలేస్తాఁడు. ఊరుకుం టాఁడు తర్వాత !

సం:—కూఁకలెయ్యడముతో నూరుకొనఁడు, అప్పటికూరుకున్నా, నెమ్మ దిమీఁద ఏదో ఆలోచిస్తాఁడు.

సుం:—సరే, "అటునుంచి నరుక్కునిరమ్మన్నారు" అది చూద్దాము.

సం:—ఒకవేళ "ఇటునుంచి నరుక్కురమ్మంటే!"

సుం:—అబ్బ! మీతో మాటాడటము కష్టమండీ!

సం:—పోనీకాని, సుందరము, నేను రేపు రాను. ఇంకీవేళకై పోయింది కదా? ఈలోపున ఏమీ గొడవలేకపోతే నాకు మెల్లిగా కబురు చేయించు అప్పలమ్మచేత! అప్పుడు నేనువస్తాను. ఏమి నిన్న రాలేదని మీనాన్నడిగితే ఒంట్లో బాగులేదని చెప్పేస్తాను.

సుం:—మీరుట్టి పిఱికివారండీ! మేష్టరుగారు!

సం:—పిఱికితనముకాదు! ఒకవేళ శాస్త్రి తెలిసిందంటే కసాతురివికనక నిన్ను ముద్దుముద్దుగా మొదలిస్తాఁడు. నాకు పలచపలచగా నాలుగు వడేయిస్తాఁడు ఏ వెంకటరెడ్డితోటో!

సుం:—(నగుచు) నన్నొకలాగా, మిమ్మొకలాగా, చూడడండి, మానాన్న, నిజంగా మనవ్యవహారము ఆయినకుఁదెలిస్తే! మా నాన్నలాటి నాన్న ఏపిల్లలకు ఉండడని నాయభిప్రాయము.

సం:— చూస్తాముగా! "తినఁబోతూ రుచులెందుకు"?

సుం:—సరేచూడండి! మీకే తెలుస్తుంది!

సం:—సుందరమోయి! వెయ్యిచెప్పాలకుచెప్పు! నేను రేఁపెలాగా రాను! నీకబురొస్తే ఎల్లుండివస్తాను. లేకపోతేరాను అనలు చెప్పు న్నా!

సుం:—అమ్మో, నా మాటేమిటి?

సం:—నీమాటనీమాటే! నామాటనా మాటే!

సుం:—అట్లయిన, నన్నుఁగూడ తీసికొనిపొండు!

సం:—అవొఁకటా! మరీ పగపడ్తాఁడు మీనాన్న! నువ్వుగూడలేచివచ్చావంటే! ఇప్పుడయితే, పోనీ వాడికోలిమనకెందుకని వూరు కుంటే వూరుకోడానికి అవకాశముంది; అప్పుడింకవుండదు.

సుం:—మీరు లేనిదినమొకటైనను నాకొక యుగముగానుండదా?

సం:—పట్టినే అంటావు. కాని నిజంగా అలావుంటుందానీకు?

సుం:—నామనస్సు మీరెఱుఁగరు?

సం:—ఎఱక్కేమి? బాగా ఎఱుఁగుదును.

సుం:—మీరు మాటాడే మాటలన్నీ శ్లేషలేనండి.

సం:—అవును నాకు శ్లేష్మమెక్కువ! అంచేత ఎప్పుడూ అలాగేమాటాడుతుంటాను.

సుం:—(నవ్వుచు) నాన్నగారికి తెలిసినా భయంలేదు. మీరు వస్తూవుండండి పోతూవుండండి! సంగీతము చెప్తున్నారనేకాదు! నేను చదువు మానేశినా మిమ్మల్ని రమ్మనే నాప్రార్థన!

సం:—ఇపుడేదో చదువుందికనక, ఎందుకొస్తున్నావయ్యా అంటే చదువు చెప్పడానికనొచ్చు! అప్పుడేమి చెప్పను.

సుం:—ఉండండి! నాకడుపులో ఒకవుద్దేశముంది. అది నాన్నగారెపుడు కులాసాగావుంటారో ఆసమయముచూచి చెళ్ళగక్కదామని వుంది.

సం:—ఆయుద్దేశమేమిటో నేను తెలుసుకోవచ్చునా?

సుం:—ఇపుడే తెలుసుకొన్నందువల్ల నేమీప్రయోజనములేదు.

సం:—ఒకవేళప్రత్యక్షంగా వెంటనేలేకపోయినా, ఒకప్పుడుంటుందంటే ఆశగావుంటుందిచూడు.

సుం:—"ఆశాపాశపరమదుఃఖము, నిరాశాపరమసుఖముకాదండీ!"

సం:—సుందరఘు! తయారయావు! నుమా!

సుం:—మీరు తయారుచేసినదేకదా!

సం:—ఏవిటో పేరునాది, అంతేకాని, నేను నిజముగా నీకునేర్పినదేమున్నది? ఇంతకు నాకొచ్చినదేముంది, విశేషంగా!

సుం:—అలాగంటారుమీరు! మీకుఁదెలియనదీ ప్రపంచకములోలేదు. నిండుకుండ ఎపుడూ తొణకదు. పట్టికుండేతడతడలాడదము!

సం:—అవును గాని, సుందరము! ఏవిటినీకడుపులో ఛ్ద్రేశముందన్నావు!
నాన్న గారితో చెప్తానన్నావెపుడో చెప్పవదేమిటో!

సుం:—ఉంది! మీకూచెప్తాగా చెప్పవలసివచ్చినపుడు!

సం:—"పోస్టుపోను" చేస్తె బ్యూటీలేదు! ఇపుడేచెప్పాలి!

సుం:—ఇప్పుడుచెప్పనుమీకు !

సం:—మొదటిమాటచెప్పు! అంతావద్దులే !

సుం:—నన్ను బలవంత పెట్టొద్దు!

సం:—(చెంతకుఁజేరి బతిమాలుకొనుచు) నన్నుఁ జంపుకుఁదిన్నట్టే !
చెప్పవు !

సుం:—(లజ్జాభరముతో) చెప్పఁజాలనండి!

సం:—చెప్పఁజాలుతావు చెప్పు! లాకపోతేనీకునాకు జట్టులేదన్నమాటే

సుం:—(మరీసిగ్గుతోఁగ్రిఁగంటజూచి) నాకునెలతప్పిందండి! (అనిశిరము
వాల్చుకొనును)

సం:—(సంతోషముతో) ఓహో ! ఓహో ! సరే! ఇంకచెప్పొద్దులే
తెలిసిపోయింది!

సుం:—తెలియడము! అపుడేపోనడముకూడా అయిపోయిందన్నమాట !

సం:—అఁ! ఊరుకుందూ ! మాటమాటకీ అర్థాలుతీయకు! కాని,
సుందరమోయి! నాకుసంతోషానికిలేదు విచారంగాకూడ
వుంటున్నది! అట్టిభవిష్యత్తు కనబడడములేదు నాకెక్కడా !

సుం:—కనబడే టయిమొస్తే అదేకనబడుతుంది.

సం:—ఆఁడవాళ్ళకు సాహసమెక్కువలే! మీకున్నధైర్యము మాకుం
డదు. అందుకే ఆఁడదిఅబద్ధమాడితే గోడకట్టినట్టు, మగాఁడా
డితే, దడికట్టినట్టు అంటారులోకులు!

సుం:—అనడమేకాదు! నిజముగూడ అంతే!

సం:—అయితే, సుందరము! మనస్నేహము శాశ్వతముగా లోకములో
నెలకొల్పుచున్నామన్నమాటేకాదు ?

సుం:—మీారేగా అనుకున్నాసరే !

(తెరలోపలినుండి)

గో:—సుందరము! సుందరము!

సుం:—ఆఁ! వస్తున్నా!

సం:—(ఆతురతతో) ఎవరది మీానాన్నలాగున్నాఁడు! ఇంకాపోక,
ఇక్కడేమిచేస్తున్నాఁడని ఒకవేళ ఎగిరినా ఎగురుతాఁడు!

సుం:— వెళ్ళిరండి రేఁపుకలుసుకుంటాముగా!

సం:—కాదు ! ఎల్లుండి !

సుం:—కాదు! రేఁపు! రేఁపే!

సం:—చూస్తానుగా ! (అనిపోవును)

సుం:—(పోవును)

(తెరపడును)

ఎనిమిదవరంగము

ప్రవేశము:—శంకరము : వానిభార్యగంగమ్మ వేరువేరుమంచములపై
శయనించియుందురు.

(అర్థరాత్రిసమయము)

ప్రవేశము:— (వేంకటరెడ్డి నల్లని ముసుగుధరించి చేత క్లోరోఫారము
సీసా, ఫ్లెనల్‌గుడ్డ వగైరాతో ప్రవేశించును).

వెం:—(మెల్లిమెల్లిగానడచుచు) నారాజా! (పెదవులనప్పళించుచు)
ఏమిరా నాఅదృష్టము! ఏంతిరిగానురా, నీకోసంశంకరంగా!
ఊళ్ళోలేఁడనిపించేశావా! ఇంట్లోముసుగెట్టుకొని తొంగున్నా

న్నావా ?తొంగో! అలాగేతే [illegible] నిన్ను స్వర్గానికి పంపించేస్తాను

శం:—(కదలును)

వెం:—(వెనుకకువచి) అమ్మో! తెలిగేశ్వర్నాఁడురో! (అనిదాఁగు కొనును)

శం:—అమ్మా (అనిమూల్గును)

వెం:—(కొంచెముఆలోచించి ముందునకువచ్చి) ఏటి అమ్మకావాల నీకు! ఎల్లుగానివుంటు అమ్మదగ్గిరికి బాబుదగ్గిరికినీ! బాబోరే! ఎల్లుగాని వుండాపి! ఇతరులపెళ్ళాలు నీపెళ్ళాంలాటివాళ్ళు కారటాపి! సంసారిస్త్రీలను చెరిపేవాళ్ళు యిలాగవుతారాఖరికి అని ఆలోకానికెల్లి చెప్పరా! (అని ముందునకుఁబోయి యటు నిటుతక్కుచుఁ దారుచు నడిమైనవుడు మూలదాఁగుకొనుచు మరలవచ్చి) ఈఅమ్మముఖంజూత్తే జాలేత్తాది! పాపము మా యిల్లాలు! ఈఁడుట్టినవటకాని, తల్లిమాలచ్మి ఎక్కడుంటే అక్కడన్నము పుట్టుంది. (అనినమస్కరించుచు) ఏంఖర్మము! తామరాకుమీఁదుంటే నీటిసుక్క ముత్తెములాగుంటుంది! కాల్తున్న యినుముమీఁద పడితే కనేబడదు!

శం:—(గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచుండును) ఓరిబాబు! "డీసెలుకారు" కూత కంటె నీగుఱ్ఱు బాగాయినిపిస్తున్నాది. ఎహేయి!! (అని శంకర మును సమీపించి గుడ్డసర్దుకొని ముందునకువచ్చి) ఇప్పుడు మ్మెం డెట్టి మతిపోగొట్టేసి సంపేస్తాను. కాని, అఁడికెలాగ తెలడము. ఫలానివాఁడు సంపేఁడని! ఫలానితప్పుకి ఫలానిదిచ్చని! ఏది నిద్దట్లోనిద్ర పెద్దనిద్దరయిపోతుంది, (ఆలోచించి) పోని, లేపి సంపనా? బాబోయి! అల్లర ఒఁపోదూ! ఈఅమ్మతోనిస్తేనేపాటం! (అని మరల ముందునకుఁబోయి ఫ్లానల్ గుడ్డ శంకరము ముక్కు [illegible] దాఁకించి) పీల్చు! పీల్చరాబాబా!

గం:—(మంచముపై నిటునటు దొర్లును.)

వెం:—(వెనకకుపోయి) కంచెప్పు తెగకమ్మా! (అని మరల శంకరము చెంతకుఁబోయి బాగాక్లోరు ఫారముపోసి గుడ్డ వాసనఁజూపించును.)

శం:—(తుమ్మును)

గం:—(మరల కదలుచు) ఏమండోయి! ఏమండోయి!

వెం:—ఏం!

గం:—కోడికూసిందాండి?

వెం:—ఇంకా లేదు! తొంగో! తొంగో!!

గం:—(కనులువిప్పి) ఎవరుచెప్మా! తొంగోఅంటున్నారేమిటి! ఇది మా ఆయనమాటకాదు. పడుకోమంటారు కాని "తొంగో మంటారా"? ఎవఁడో శూద్రుఁడు దొంగాఁడయివుంటాఁడు.

వెం:—(మాటాడక) శంకరము మంచముక్రింద దూరును).

గం:—చూద్దామెవరో! (అనిలేచి కనులు నులుముకొనుచు) ఏమాండోయి! మిమ్మల్నే! అయ్యో, మాటాడరేం! (తనభర్త మాటాడకుండుటఁజూచి గంగమ్మ శంకరమును సమీపించి చేతితోతట్టి లేపుచు) లేవండి! ఏమీ మొద్దునిద్దర! (శంకరము పలుకకుండుటఁజూచి) బాగానేవుంది! ఉండండి! లేవండి! ఈలోపున లాంతరైనా వెలిగిస్తాను (అని మంచము క్రింద లాంతరునకై వెదుకుచుండును)

వెం:—(హఠాత్తుగా గంగమ్మనోరు మూయుచుండును).

గం:—అమ్మో! దొంగ! దొంగ!! (అనియఱచును).

వెం:—(గంగమ్మనోరు గట్టిగాఁబట్టుకొని) అఱవకు! అఱచావంటే

గం:—(గిలగిలకొట్టుకొనుచుండును).

వెం:— ఇదిగో నీముకుందు, నాజీతం ప్రతినెలా యిచ్చేయిమంటు న్నాఁడు నాకుద్యోగం యిప్పించాఁడని గోపాలరావుగారింట్లో! నేనెవరో తెలుసునా గోపాలరావుగారి సంగీతపు మేష్టర్ని! శంకరం నిద్రలోంచి లేచాక చెప్పు ఆసంగీతపుమేష్టరు మిమ్మల్ని సంపెయ్యిడాని కొచ్చేఁడు వీలులేక వెళ్ళిపోయాఁడని! (అని చెప్పి పట్టువిడిచి పాఱిపోవును)

గం:— అమ్మయ్య! బ్రతికానురాదేముఁడా! దొంగల్లోనూ మంచి వాళ్ళుంటారు కాఁబోలు! అయ్యో నా తెలివితాల! వాఁడుదొం గేమిటి గోపాలరావుగారింట్లో సంగీతపుమేష్టరఁట! ప్రతినెలా వాఁడిజీతము మాఅయన యిచ్చెయ్యమంటున్నాఁడనే యీర్ష్య చే చంపెయ్యిడాని కొచ్చివుంట్రాఁడు! ఒకవేళ, వెంకటరెడ్డి కాఁడుకద! అయ్యో, మతిలేనిమ్ముండను స్పష్టముగా చెప్తేనే సంగీతపు మేష్టర్నని! (అని శంకరమును సమీపించి) ఏమం డోయి! ఏమండోయి! (నిదానించి) ఇంకేమి యేమండి! అప్పుడే అఱగంటయి అయిపోయింది నోరుపడిపోయి! ఏదో మందు చల్లి పోయాఁడు కాఁబోలునురాదేముఁడా! లేక, విష మాపెట్టేఁడో, లేక, గజ్జేరేపెట్టేఁడో! వెధవగొడవల్లోకి వెళ్ళు కాఁడు! ఇలాంటిపగలు సంభవిస్తాయి. ఉంటే తిని, లాకపోతే పస్తుపడుకొని, అమ్మగానివాళ్ళనమ్మాయని, బాబుగాని వాళ్ళ ను బాబూఅని రోజులు వెళ్ళబుచ్చుకుంటే ఎంత అందంగా వుంటుంది, ఇలా అడ్డమైనవాళ్ళ నోట్లోను నోరుపెట్తే ఎంత అందంగావుంటుంది. "పుట్టెనుపుట్టినబుద్ధి పుడకలతోనేగాని పోదని" ఒకరు చెప్పినమాట వినడమే! పౌరుషానికి [illegible] రాదు!! ఏంజెయ్యను ఇప్పుడు భగవంతుఁడా! ఇంకా [illegible] రలేదు! అఁధకూతుర్ని ఒంటరిగానున్నానిక్కడ! [illegible]

దొంగో అహంతకుడో మళ్ళీవస్తాడేమో! నాకు శాళ్ళకు ''నడ'' లంకించుకుంది! నేనిక్కడుండలేను బాబోయి! పోలీసు స్టేషనులోకిపోయి జరిగిన సంగతంతా చెప్పుకుంటాను. ఆస్టేష నుంట ఆనందవతలే కనక మతేమిఘరవారాదింతలో! (అని విచారాక్రాంతవదనముతోఁబోవును).

(తెరపడును).

తొమ్మిదవరంగము.

(ప్రవేశము : గోపాలరావుగారు, సుందరమ్మ)

గో:—అమ్మాయి! సుందరం! ఈసంగీతపు మేస్టరు పరసేమినాకు నచ్చడములేదు. కోర్టరుషీటు యిచ్చేద్దామనివుంది! ఏమిటి నీయభిప్రాయము?

సుం:—(విముఖతతో) ఇచ్చేసావారు మళ్ళీనన్నడగడ మెందుకు? ఇచ్చేయండి.

గో:—కాదమ్మా! తల్లీ! నీయభిప్రాయమేమిటని అడుగుతున్నాను గాని, నిన్నడగకుండా నేనేపనైనాచేస్తున్నానా?

సుం:—ఏం! ఎందుకు తీసేస్తారాయిన్ని? ఆయనవల్ల ఏమితప్పుపట్టు కున్నారుమీరు?

గో:—(గుంభనగా నాలోచించి) అట్టేతప్పుపట్టుకున్నానికాదు; అతని విద్యఅంతా నేర్చుకున్నావా? ఇంక ముంటువిశేషంగాఁ జెప్ప డానికి అతనికి పాండిత్యము చాలదు! మరెవ్వరైనా మంచి వారుంటే యీయనను మారుద్దామని! అంతే!

సుం:—ఈయన్ని మార్చడము నాకిష్టములేదు!

గో:—సరేపోనీలే! (మరలనాలోచించి) అమ్మా! లోకులు కాకులు వంటివారుసుమా!

సుం:—అవును.

గో:—ఈ సంగీతపుమేష్టరు చనువుగా అస్తమానము మనయింటికొస్తున్నాడని ......

సుం:—ఆఁ! ఒస్తున్నాడని ?

గో:—వినవేతల్లీ! సొంతముగా! నలుగురు నాలుగువిధాల అనుకుంటున్నారు.

సుం:—అందులో ఒకవిధముచెప్పండి ఏమనుకుంటున్నారో!

గో:—ఏమీలేదు! ఏదో అతనికీ నీకు సంబంధము వుందని?

సుం:—అనుకోనివ్వండి! వాళ్ళనోళ్ళు నొప్పిపెట్టినపుడు వాళ్ళేయూరుకుంటారు!

గో:—అంతేలే ఎలాగాను!

సుం:—సరేకానండి, నాన్నగారు, మీరేమైనా అనుకుంటున్నారా?

గో:—నేనేమి అనుకుంటాను! కడుపుకోసుకుంటే కాళ్ళమీఁదే పడుతుంది!

సుం:—అవునుకాని, నాన్నగారు, నన్నింతవరకు నిలవఁదీసి అడుగుచున్నారుగనక, మిమ్మల్ని నేనొకమాట నిలువఁదీసి అడుగవచ్చునా?

గో:—నేను నిలవఁదీసి అడుగుతున్నానా? అయ్యో! వెఱ్ఱితల్లీ! ఏదైనా ఒకవిషయముంటే ఆలోచనకి నిన్నుఁగాక మరెవ్వరిని అడుగడము? నాప్రాణానికి నీప్రాణముతోడు! నీప్రాణానికి నాప్రాణముతోడు!

సుం:—మాటవరుసకంటారు! కాని మీమనసులో ఏదోవుంది! చెప్పడములేదు.

గో:—ఉంటే! తప్పకుండాచెప్పేద్దును! ఏమీలేదుఈఘుడియకు!

సుం:—అయితే మనసులో నేమీలేకుండావున్నప్పుడే, చెప్పేస్తే బాగుం
టుందని తోస్తుంది.

గో:—చెప్పుతల్లీ ! నాదగ్గరనీకు సిగ్గేమిటమ్మా! భయమేమిటమ్మా!

సుం:—నన్ను ఆసంగీతపుమేష్టరుగారికిచ్చి పెళ్ళిచేయండి !

గో:—శ్రీరామచంద్ర ! (అని చెవులుమూసుకొనును)

సుం:—చెవులు మూసుకోకండినాన్నగారు ! అలాచేస్తే చాలాఅంగీ
కారంగావుంటుంది !

గో:—ఎవరికి ?

సుం: — అందరకీన్నీ !

గో:—నీకు, నాకూ, ఆమేష్టరికి వుంటేవుండొచ్చుకాని లోకానికికాదు.

సుం:—అబ్బే! సర్వజనసమాదరణీయముగావుంటుంది !

గో:—అయ్యో! అలాచేసినప్పుడు నాతలమీాఁద వెండ్రుకలుంచరు.

సీ॥ సాటివారలు మన ♦ సంఘమువారింట
విస్తరి యొకపూట ♦ వేయరమ్మ!
కథలు కార్యాలు రా ♦ గ, మనల, మనవారె
విందుకు రమ్మని ♦ పిల్వరమ్మ!
మనదు వంశావళి ♦ చనునంతవరకింక
చుట్టరికముఁబొందఁ ♦ జూడరమ్మ!
కాలో, చేయిమొ, వంగ ♦ కావలసినవారె
వీధిగడపలో కాలు ♦ పెట్టరమ్మ!

గీ॥ ప్రతిశుభా శుభకార్యము ♦ లన్ బహిష్క
రిఁతురు ననురిపారుమన్ ♦ పంతులంచు;
నిన్ను మారుమనువుచేసు ♦ కొన్నదాన
వంచు భరియింపఁజాల నా ♦ వ్యధనునేను!

సుం:—మీరు భరింపలేకపోతే పోనీయండి, మఱి, నామీఁద నింక మీరు తొల్లింటి ప్రేమ నుంచుకోకండి!

గో:—అదేమే సుందరము! అలాగంటున్నావు?

సుం:—అవును. నాకు పెళ్ళిచేయడానికి మీకిష్టములేదు. కనక ఎక్కడకో, ఏ వితంతు శరణాలయానికో నేనే పోయి, నాపెళ్ళి నేనే చేసుకుంటాను. అమ్మ లేనేలేదుకద! సరే, నాన్నగారుకూడా నాకు లేరేలేరనుకుంటాను.

గో:—(గుడ్లనీళ్ళునింపుచు) నేనుండగా లేరని ఎలా అనుకుంటావు సుందరము?

సుం:—అవును అనుకోవలసినదే! నానుండిమీకుఁ గులము పోతుందని అప్రతిష్ట వస్తుందని భయంగావుందా! నేను మీదగ్గరనుండి దూరముగాపోతే, మీకులానికిగాని, మీప్రతిష్టకుఁగాని భంగ ముండదు. నా యోగము బాగుంటే బాగుపడతాను. లేకపోతే చెడిపోతాను. ముక్కుపచ్చలారని లేఁబ్రాయమున నాకు వైవాహికపు ముచ్చటలు జరిపి నాకపరిచితుఁడగు నొకయువకుఁ డెపుడో, ఎచటనో, చనిపోయెనను మిషను నాకిన్నాంత నిర్బంధముఁ గలుగఁజేయుఁ దలిదండ్రులున్న నొకటే, లేకున్న నొకటే! నాకిదివరకుజరిగినది పెండ్లికాదు. అది బొమ్మలపెండ్లి. నిజమైనపెండ్లి నేనేచేసుకొనుచున్నానిపుడు. నిప్పటుపాతబుద్ధిగల యొక కొందరైనను నాయిప్పటి వివాహమునకానందింపకపోరు!

సీ॥ రామయ్యకూఁతురు • రమణమ్మ పెనిమిటిన్
రోసి పుట్టింటఁ గూ • ర్చుండుకంటె;
అవధానిగారి వి • ధవకూఁతురు, శిశువున్,
పెంటపోగులో పాతి • పెట్టుకంటె;

శర్మగారసూన్మయి • శశిరేఖ, యుపభద్ర
లనుగూడి పట్నముఁ • జనెదుకొంటె;
చయనులుగారి త • నయ, సుభద్రి, పతికి
విషభోజనమిడి చం • పించుకంటె;

గీ॥ హాయిగా నేను బెండ్లాడి • న్యాయజీవ
నముగడప హేయమగునె ? దు • ర్నయముతోడ
వారిజీవించి కులముఁ గా • పాడుకొనుట
పహ్యమే ! న్యాయమిదె ధర్మ • శాస్త్రిమందు ?

గో:—సరేలే, ఏదో, నేనే, ఎవరినో నెమ్మదిమీఁద చూసి చేస్తాను ! ఇవుడేమి నువ్వు తొందరపడకు !

సుం:—నేనేంతొందరపడుతున్నాను! నేనామేస్టరుగార్ని తప్ప యింకో కరిని చేసుకోను.

గో:—మళ్ళీ అందులో అదోకటా!

సుం:—అందులో అదొకటికాదు! అదేమొదటిది! అదేయాఖరిది!

గో:—వాఁడిముఖము! ఆమేస్టరికేముంది చెప్పు! మనయింట్లో పాఠాలు చెప్పుకోకపోతే వాఁడికన్నమేలేదు!

సుం:—అన్నముపుండనివ్వండి లేక పోనివ్వండి! అతనికిచ్చే నన్ను యథావిధిగా పెండ్లిచేయండి!

గో:—పెళ్ళేమో చేస్తాననుకో! నిన్నెలాపోషిస్తాఁడు? వాఁడు!

సుం:—అతను హార్మోనియముపెట్టి వాయిస్తూ పాడుతుంటాఁడు. నేను జోలికట్టుకొని వెనకాలుంటాను. ఇంటింటికి ముష్టికెళ్ళతాము. కలిసో, గంజో, ఏచెట్టునీడనో కాచుకొని తాగుతాము. మీరు మేడలు మిద్దెలలోపడుకుంటే మేమూచెట్టునీడనే పడుకుంటాము. "గువ్వాగూడెక్కె! రాజామేడెక్కె" అంతేకాదండీనాన్నగారు ?

గో:—(నిట్టూర్పునిడచి) ఆసంగీతపుమేష్టరు—అమ్మోయి—నాకు చాలామందిచెప్పారు నాటకాలలో వేషాలువేస్తాడుకూడానని

సుం:—వెయ్యనివ్వండి! వేస్తేయేమినేగా? "హేమాహేమీలు ఏటం బడిపోతుంటే మెంపలకంప నాగతి యేమి"టన్నట్లుగావుంది వేషాలువెయ్యనీయండి.—ఆయన నాయకపాత్రధరిస్తే నేను నాయికపాత్రధరిస్తాను ఆవిధంగానైనా పొట్టపోషించుకొంటాము. ఏమి అంత అభిమానము నామీద మీకుంటే 10 వేలు నా పేర రాసెయ్యకూడదు. అదెట్టుకని సుఖంగావుంటాము మీపేరుచెప్పుకొని!

గో:—అలాగేచేస్తానుకాని; ఈసంగీతపుమేష్టరుతప్ప మరెవ్వరైనా నేనుజూచిన వారినిం జేసుకొంటే!'

సుం:—నాన్నగారు! మీకుసమస్తము తెలుసును' నాకిష్టములేనివానిని నేనుజేసుకొని సుఖించుటెట్లు? నాకుఎఱ్ఱదుంపలకూరఇష్టము! మీరు బంగాళాదుంపలకూర అంతకంటే మంచిదికదా అని తినమంటె ఏలాతినను?

గో:—సుందరము! ఈమేష్టరొచ్చాక బాగామారిపోయావునువ్వు ?

సుం:—అవును నిజమంతే! నాన్నగారు! ఆసంగీతపుమేష్టరుగారివల్లే నా జీవితయుగములో నూత్నశకము ప్రారంభమైనది.

(ప్రవేశము : అప్పలమ్మ)

అ:—బాబోయి ! మనియింటికి పాడ్డానికొస్తాడే ఆపంతుల్ని పోలీసోళ్లు సంకెళ్ళేసి తీసుకుపోతున్నారు.

సుం:—ఆఁ ! ఆఁ ! సంగీతపుమేష్టరుగారినా ? (అనుచు నివ్వెరపడి యుండును)

గో:—(ఆశ్చర్యముతో) ఏమే ! అతనేమిచేసాఁడు ? అతనికి సంకెళ్ళేసి తీసుకుపోడానికి !

అ:—రాత్రిశంకరంగారియింట్లోదూరి ఆరికేదోమూర్ఛపించి సంపేద్దామని ఎల్లి శాంతవరకు సంపేశి పాఱిపోనాడట!

గో:—శంకరంగారింట్లో రాత్రి దూరాడా? మూర్ఛపించి చంపేద్దామనా? అంటే ఏమిటిచెప్మా! క్లోరోఫారమయియుంటుంది వాసనచూపించేది! అయినా క్లోరోఫారము మత్తుకలగజేస్తుందికాని మనిషిని చంపెయ్యదే! ఏమో, మత్తిచ్చి మాటదక్కించుకొందామని అయివుండొచ్చు! అయినా, యింతకీ, శంకరానికి, అతగాడికివున్న అంతభద్రవైరమేముంది? ఏదో వుద్యోగమిప్పించాను రెండుమూడు నెలల జీతమిచ్చెయ్యమంటున్నాడని చెప్పుకొచ్చాడు, మొన్న ఏదోమాటొస్తే! అంతమాత్రానికి ప్రాణందీసేస్తాడా అబ్బే! అతనుగాడు! ఇంకొకరెవరో అయివుంటారు! సరేలే నాకుతెలునాకథంతాను!

అ:—ఏటబ్బే! ఇప్పుడలా తీసుకెల్తుంటేనే!

సుం:—(పెద్దపెట్టుగా నేడ్చుచుండును)

గో:—సుందరమ్మాయి! నువ్వు కంటతడిపెట్టొద్దు! నువ్వు ఏడుస్తున్నావంటే, నాకింక మతిపోతుంది! ఏపని చేయలేను.

అ:—ఏడకమ్మా! ఏటి ఆడినెవ్వడనో తీసుకెల్తుంటే నువ్వేడ్డమేటి? మరోమేష్టర్ని ఎట్టుకుందుగాని లెగవమ్మా!

గో:—నువ్వూండవేముండ! మాటాడకు! ఇలారా, అమ్మాయిని పడిపోకుండాపట్టుకో! నేనువెళ్ళి ఆసంగతేమిటో కనుక్కొస్తాను.

సుం:—(కొంచెము ధైర్యమువహించి) నాన్నగారు, నిజంగా మీరు వెళ్ళి కనుక్కొస్తారా?

గో:—నువ్వు ఊరుకుంటానంటే నేను వెళ్ళుతాను. కంటంబట ఒక్కచుక్కైనా నేలరాలగూడదు, అలా ఏడవనని వాగ్దానముచేస్తే

వెళ్ళి ఆదేమిటో కనుక్కొస్తాను. వీలుగావుంటే విడిపించుకొనే వొస్తాను.

సుం:—(సంతోషముతో) నాన్నగారు విడిపించుకొనేవస్తారా? అయ్యో, ఎంతమంచివారండీ మీరు! మీమంచికని పెట్టలేక నేనేమిటేమి టో వాగేశాను ఇంతకాలముగూ!

గో:—ఏంజెయ్యను! "పాలకోసము రాళ్ళు మొయ్యవలసొస్తే మొ య్యాలి" కాని నువ్వు ఏడ్వవొద్దుసుమా! చెప్తున్నాను.

సుం:—నాన్నగారు! ఏడవనండి! త్వరగా. వెళ్ళిరండి!

గో:—అప్పలమ్మోయి! అమ్మాయి జాగ్రత్త!!

అ:—ఏటిబాబు! ఎల్లిరండి! అమ్మాయి ఏమయిపోతది? నా నేమై పోతాను!

గో:—సరేలే, జాగ్రత్త!! (అనిపోవును)

అ:—(సుందరమ్మకుఁ బరిచారము సేయుచుండును)

సుం:—ఓయి సర్వేశ్వరా! నీకెంత యోార్వలేనివాఁడవు! శైశవావస్థను నాకు భర్తృవియోగముఁగలిగించి నీపరిపాలనాధర్మమునిది పేర్చు కొంటివని నింగికినిక్క యానందించుచున్నావు! నీది ప్రేమస్వ రూపము! అఖిలావనీప్రజ నీసంతానమని వేరువేరుమతస్థులు నిన్ను వేరువేరువిధముల నుతించుచున్నారు! నీది ప్రేమస్వరూ పమా! నీవు సంతానవంతుఁడగు తండ్రియనుటకుఁ దగుదువా? నేనీ నామధారణమునకుఁ దగనని యేల యే మతస్థులకైన నౌకరికిఁ గన్పించి నీ యునర్హతఁ బ్రకటింపవు? పరమేశ్వరా! నీవు లేనేలేవు! నీవుంటివని యొకరును, లేవనియొకరును, వాద ప్రతివాదములుఁ జల్పుకొనుచుండ నీయునికి నే యొకరికైన దర్శనమీయఁజాలవేల! నీవెయున్న యిదినీపిటికిదనము వెల్లడిం పదా? నీవెల్లరకుఁ బ్రత్యక్షమైన వారివారి యాప్సితముల

నెరవేర్పవలసి వచ్చును, అంతట నీసామ్రాజ్యపాలనము సరిగా సాగదని భీరువువై యెన్నాళ్ళు ఎచట దాగుకొందువు ? మేము పాపాత్ములము ! మాకుఁగాదు! పయోగ్యులగుఁ బుణ్యాత్ములకైనను నీవుకలవనియే తెలియఁజేయకపోవుట సాహసమే!

అ:—ఏటి ఒల్లకోనమ్మా ! ఎల్లేఁడుగాదు బాబు ! ఈసికొత్తాఁడులే ! ఏడకమ్మా !

సుం:—అబ్బా ! (అని చీకాకుపడును)

అ:—దేముఁడిని దెయ్యాల్ని తిడితే ఒత్తాడేఁటి ! ఎల్లి డబ్బుకట్టిత్తే అళ్ళు ఒగ్గేత్తారు !

సుం:—ఓ రాధామనోహరా ! ఎవరిని నాబహిఃప్రాణమని యిన్నాళ్లుఁ జూచుకొనుచున్నానో; ఎవరిహితోపదేశములను శీతలవాతాతపమునమోడువడిన నామానసభూరుహము మరలజిగిర్చి పూవులు బూయుఁదొడగెనో; ఎవరి నామరణాంతము విడువనని ప్రమాణముఁజేసియుంటినో యట్టినావన్నెకాఁడు, నామనోహరుఁడింకఁ గలవాఁడౌనా ? నిరపరాధియగు నాచెల్మికానిని నిర్దయతో బంధించిన యోపోలీసులారా !

అ:—పోలీసోళ్ళునితిట్టకమ్మా ! పేరురాసుకోఁగలరు ! దేముఁడుకాదొల్లకోడానికి !

సుం:—అబ్బ ! దాహము ! దాహము !!

అ:—ఉండమ్మ ! సోడాబుడ్డి ఒట్టుకొత్తాను! (అనిపట్టుకొనివచ్చియిచ్చి) అమ్మోయి ! నానొకమాట సెప్తాను ! ఇనుకుంటావు ?

సుం:—ఏమిటే అది ?

అ:—ఇనుకుంటానంటే సెప్తాను !

సుం:—చెప్పవే ! వింటాను !

అ:—సెయ్యిసూస్తాఁడు సిష్టికరణము ! ఎల్దాముకావమ్మా ! అతని దగ్గరికి ! ఉన్నదున్నట్టు చెప్పేస్తాఁడు !

సుం:—ఎవరే అశిష్టికరణము ?

అ:—ఎరగవటమ్మా ! మొన్న నాసెల్లెలుకూఁతురు ఎప్పటికీపెద్దమనిషి కాకపోతే ఎల్లిచూపించాము ! ఆబాబు సెయ్యిసూసి ఎంతో కాలముకాలేదు! ఇపుడుహాయిగా కాపరముచేసుకుంటున్నాది !

సుం:—నాకొద్దేవన్నీని, ఏవిటో మీరుచేసేవన్నీనన్నుఁగూడా చెయ్యమంటావు కర్మము ! ఎలాగచెప్పు ?

అ:—కాదు ! ఆబాబుని ఒగ్గుతారోలేదో కనుక్కుందామని !

సుం:—పోనీ, నువ్వెళ్ళి కనుక్కురావే !

అ:—నిన్నొగ్గేశా ? గోపాలరావుబాబు చూశాఁడంటే గోడకుమేకులేసి కొట్టెయ్యఁడు !

సుం:—ఫరవాలేదు ! వెళ్ళిరావే ! నేను సమాధానముచెప్తానులే నాన్నగారికి.

అ:—బాబొచ్చాకెల్తానమ్మా !

సుం:—బాబొచ్చాక నువ్వువెళ్ళడమెందుకింక ?

అ:—సరే ! ఎల్తానుకాని ! ఏడవకుండా తొంగుంటావా ?

సుం:—అస్తమానూ ఏడుపేనాఏమిటి ? ఏమిటో, వినికానిమాట విన్నానుగనక దుఃఖమువొచ్చింది ఆపుకోలేకపోయాను !

అ:—మరి ఎల్లొస్తానమ్మా ! (అనిపోవును)

(తెరపడును).

---



# ఓన్లీ డాటరు.



## చతుర్థాంకము.

### ప్రదియువరంగము.

(వాలియుండిన తెరముంగిట)

ప్రవేశము : గోపాలరావుగారు.

మ॥ అనపత్యుల్ భువినెందఱో కలిగి య ♦ ల్లాడంగ నొక్కొక్క పు
త్రునినైనన్ దయచేసివారలకు సం ♦ తోషంబుఁ జేకూర్పవో
యనఘా ! సర్వవిధంబులన్ జెడిన స ♦ న్న్యాశిన్, హతాశుండ, నా
కు నభాగ్యంబుగలుంగనిచ్చితివి యీ ♦ కూనున్ మహేశా! ప్రభో!

గో:—ఏనాఁడు నా పెరిమంఫుటిల్లాలు విచారసముద్రమున నన్నుడించి స్వర్గ మలంకరించెనో యానాఁటినుండి నా జీవతపుటోడను మత్పుత్రికా స్తంభమునకుఁగట్టి ప్రాణములు నిల్పుకొనుచుంటిని. లేకున్న నుత్తుంగతరంగనికరంబున నీపాటికి నిరాధారుఁడనై యసువులఁగోల్పోయియుండెడివాఁడను. నాపాడుశరీరముజీలుగు బెండువలె నెచటకో కొట్టుకొనిపోయెయుండెడిది ! నన్ను క్షోభ పెట్టవలయునని నీవు దృఢసంకల్పుఁడవైనచో, నన్నే క్షోభ పెట్టవలయునుకాని జీవులకుఁ బరస్పరప్రేమ నుదయింపఁజేసి యందొకదానిని రెండవదానినుండి వేరుపఱచి వియోగదవాగ్నుల కాహుతి యొనరింపఁజూచుట, సర్వేశ్వరా ! శ్రీమపరిపాలనా

గీ॥ పలుపితలఁబెట్టి నలసార్వ ♦ భౌముసపుడు
కలిమహారాజు, పెనునీర్ష్య ♦ వలనఁగాదె !
ఈర్ష్యవలనేఁగా, నందుల ♦ నెదిరి వారి
నామరూపములడఁచెఁ జా ♦ ణక్యబుధుఁడు !

పురాణపురుషులకే, రాజాధిరాజులకే యీర్ష్య తప్పినదికాదు. సామాన్యమానవులమాట వేరె వచింపవలయునా ? (అపవారించి) అదుగో, గోపాలరావుపంతులుగారిటెనకే వచ్చుచున్నారు. ఏలకోఁదా !

(ప్రవేశము : గోపాలరావుగారు)

గో:—ఏమిటబ్బాయి ! ఈ గొడవంతాను ?

సం:—నేను నిరపరాధిసంకి ! నమ్ముఁడు, నమ్మకుండుఁడు !

గో:—నమ్మకపోడానికేమ్నందిలేగాని! మఱి, ఎవరుచేసారంటావానేరము?

సం:—నాకుఁదెలియదండి ! నేను చెయ్యలేదండి !

గో:—సరే ! మఱి, నిన్నెందుకీనిర్బంధములో నుంచడము ?

సం:—అహంతకుఁడు పాఱిపోవునపుడు నాపేరుచెప్పి మఱియుఁ బాఱిపోయెనఁట కావున నాహత్యతో నాకేదో సంబంధముండియుండునని నన్నుఁగూడ బంధించారు.

గో:—ఇంకెవరినైనా బంధించారా ?

సం:—వెంకటరెడ్డినికూడా బంధించారు !

గో:—ఏఁడీవాఁడు ?

సం:—అవతలకొట్లో అతనిని పెట్టారండి !

గో:—శంకరము చనిపోయాఁడా ఇంతకీని ?

సం:—శంకరం చనిపోలేదఁటండి ! చనిపోవునోలేదోకాని వెంటనే అతని పెళ్ళాము వెళ్ళి పోలీసుస్టేషనులో గోలపెట్టిందఁట ! అక్కడుండే

వాళ్లు లారీలో హాస్పటల్లో పాతేశారట! కనక, లయిఫ్,
"సేవ్" అవవచ్చునంటున్నారు.

గో:—అతనుబ్రదికితే, మీమీఁద అంత కేసు వుండదుగా?

సం:—అంతవుండకపోవడమేమిటండి! Attempted murder క్రిందనే యేడేళ్లో కఠినవరకము వేశేస్తారట! అలా వరకమనుభవించే కంటె ఈ క్షుద్రప్రాణమును వురిస్తంభముమీఁద నొక్కసారి వదిలెయ్యడము నయము!

గో:—వెంకటరెడ్డి ఏమంటున్నాఁడు?

సం:—ఏమంటున్నాఁడో నాకుఁ దెలియదండి! ఆతన్ని నన్నూ మాటాడుకోనియ్యరు!

గో:—సరే, అతన్నికూడా కలుసుకుంటాను కాని, ఏమిటినీమాట?

సం:—నామాటేమిటో మీరే ఆలోచింపవలయునండి!

గో:—నిన్ను జామీనుమీఁద విడుదలచేయిస్తాను! తరవాత కేసునంగతి చూసుకొందాము! మఱి, యెవరినైనా జామీనువారులను దెచ్చుకోఁగలవా?

సం:—మహాప్రసాదము! కాని నాకీయూర జామీనుండువారెవరు లేరండి!

గో:—సరే, చూస్తాను! ఒకవేళ, నెవరూ దొరకకపోతే, నేనేవుండి, నిన్ను విడిపిస్తాను. నువ్వుమఱేమి యధైర్యపడకు!

సం:—తమకు శతసహస్రవందనములు!

గో:—మఱి వెళ్ళివస్తానబ్బాయోయి!

సం:—చిత్తము! నేనసాధుఁడను పంతులుగారు! నాదోషములన్నియు సైరించి మీకడుపునఁ బెట్టుకొనవలయును. మీరే నాకుఁ దల్లిదండ్రులు!

గో:—చూద్దాముకానీ! (అని పోవును)

సం:—నాకు వాచాదోషము తప్పకఘటిల్లును. పాపము పంతులుగారు నాయుదంతంబంతయు నరసి నన్నువంచించుటకిట్లు పన్నినపన్ను గడయని నేననుకొన్నమాటలు నిరాధారములు. వారెయంతటి క్రూరకార్యమునకు సమకట్టినచో మరల నాయోగక్షేమముల నరయుట కేలవచ్చెదరు. అరయుటను వచ్చుటేకాక, నానిర్బంధవిమోచనమునకుఁగూడ బాటుపడెదమనియుఁ జెప్పిపోవుదురా! పట్టిది! ఇందు గోపాలరావుపంతులుగారి ప్రమేయమేమియు లేదు. నిశ్చయముగా నానేరమును వెంకటరెడ్డియేసల్పి నాపై నుండు స్వల్పకోపకారణమున కద్దానిని ముడిపెట్టెను. కాని, యింకొక సందేహము నాకుఁ గలుగుచున్నది! సుందరముతో నధిక ప్రస్తావనముఁజల్పుచుఁ బాఠములు సరిగా నేనుజెప్పుచుండుటలేదని గోపాలరావుగారనుకొనుచున్నారని చూచాయిగా నాకిదివఱకే తెలిసినది. దానిమీఁద వెంకటరెడ్డి నాఁడు నాతో వచించినప్రకారము గోపాలరావుగారికి మా రహస్యప్రేమను వెల్లడించినచో గోపాలరావుగారి తోఁకతొక్కిన కోడెత్రాచు వలె లేచునుగాని యింతసాత్వికముగా నుండరు. ఒకవేళ సర్వమెఱింగినను సుందరముయెడలనుండెడివాత్సల్యాతిశయమున నది మఱుఁగునఁబెట్టికొనియైన నుండవలెను. ఏది యెట్లున్నను వారికి నాపై నేవగింపుగలుగనిమాటమాత్రము సత్యము! ఈశ్వరానుజ్ఞ వలన నాకుఁ జెఱవిముక్తి కలుగునేని సుందరమును నేను శాశ్వతముగా, స్వేచ్ఛగా, బహిరంగముగా నావస్తునయనిచెప్పి చెప్పించుకొనుటకు సావకాశము కల్గునేమో! భగవంతుని మహిమ యనంతముగదా!

(తెరపడును)

(మరల తెర లేచును)

(ప్రవేశము : వేంకటరెడ్డి ఖై దీవలె కన్పడును)

("నర, నర, నరబండి." వంటి చలాకీపాటలు పాడుకొనుచు)

వెం:—తెలక సెయ్యడము తెలిసి అనుభవించడము! పోనేదో, రెండు మూడు లెంపకాయలుకొట్టి ఒగ్గేయక పేణంతీసెయ్యడందాకా ఎల్లిపోయాను. ఎల్లివుట్టిఎదవలాగొచ్చేశాను. సంపేశినా కొగుం డును! పేరుండిపోను! పిఱికిఎదవరా అని ఇంక అందఱు అను కుంటారు. ఎలాగాతప్పిందికాదు యీాఒనవాసం! ఆకాస్తమా టా దక్కించుకుంటే, పనుకుంటే, యింకో నాలుగ్గ దేళ్ళుక్కువ పసుకుంటాడుకాని ఇంకేటిసెయ్యగలడు? అదికాక నన్నెవడ డేమి సెయ్యగలడంటాను! నాను సంపేసని సూచినోడేడి? సూడొద్దేంటి సంపడముగటాొను! పటి శంకరంగాడి పెళ్ళాం ఎల్లి పడిస్తే అయిపోయిందేటి! మామేస్త్రికి కబురెట్టాను. ఆడొచ్చేడంటే, బాబారే, కడుపులోఎట్టుకోరా అని పడిసేసా నంటే, ఎల్లి పెద్దపీడరు నెట్టేత్తాడు. అపీడరెల్లి బల్లగుద్దేస్తాడు! బల్లగుద్దేశాడంటే నన్నొగ్గేస్తారన్నమాటే! సంగీతపుమేష్టరుని సంపేశారన్నమాటే! పాపము, ఆడిముకముచూస్తే నాకు కని కరంపుడుతున్నాది! పకర్మము ఎఱుగడు ముండకొడుకు! కాని నిక్కిపోయాడాయాల శంకరంగాడు ఎక్కడుంటాడంటేను! "పోవోయిపుల్లయ్యా" అన్నాడు; ఈడా, నేనా, యిప్పుడు పోయినపుల్లయ్యను! (అనుచుండ)

(ప్రవేశము : గోపాలరావుగారు)

గో:—పమోయి! వెంకటరెడ్డీ!

వెం:—బాబు దండాలండి! (అని నేలవ్రాలి మ్రొక్కును)

గో:—సరే! చిలకకు చెప్పినట్లు చెప్పుకొచ్చాను విన్నావుకాదుకద నామాట?

వెం:—ఆయాల కొంచెము నీళ్ళుపుచ్చుకున్నానండి బాబు !

గో:— నువ్వు నీళ్ళుపుచ్చుకోనిదెవుడు ?

వెం:—లేదు బాబు ! తల్లితోడు ! తమరు ఎనక పెద్దపంతులుగారికి కూకలే శారే, అప్పటినుండి మానేశానండి ! మొన్న యీగొడవ వచ్చి నప్పటినుండి, మాపులు పుచ్చుకోనేవాడినండి !

గో:—ఇప్పుడు పుచ్చుకుంటున్నావా ?

వెం:—ఇప్పుడేమి పుచ్చుకోనండియింక ?

గో:—నిన్ను కోసినా పాపములేదు ! ఎన్నివిధాల చెప్పుకొచ్చాను విన్నావు ? ఇప్పుడేముంది ఒకళ్ళకితెచ్చావు; ఇద్దరికితెచ్చావు; అర్థరాత్రివేళ నందటికితెచ్చావు అని అంటించాశేవు లంకాపురి నీపెళ్ళాము నిన్ను దీసుకొనిపోయినప్పటినుండి నిన్ను విడిపించు కొనిరమ్మని ఒకవంక పోరు ! అమ్మాయి సంగీతపుమేష్టరుని విడిపించుకొనిరమ్మని మరొకవంక పోరు ! ఎలాగ? నిన్నువిడిస్తే అతన్నివిడవరు ! అతన్నివిడిస్తే నిన్నువిడవరు ! నేను మధ్యను చావవలసివచ్చింది !

వెం:—బాబు తమరలా సెలవియ్యకండి ! రక్షించాలండి !

గో:—పోనీ, శంకరంగార్ని చంపటానికివెళ్ళినవాడవు, ఆమేష్టరు పేరెం దుకుచెప్పడము ? అతనిని అనవసరంగా ఏడిపించడానికేనా ? అతడేమైనా ఎరుగునా ? ఏముంది, అతనిపేరుచెప్పి పాటిపో యావుకనక, అతన్ని; అసలు అనుమానము నీమీదనుందికనక నిన్ను దూశ్చేశారు. మీకేమి మీరు హాయిగానేవున్నారు; మిమ్మల్ని అనుసరించివున్నవాళ్ళదీ అవస్థగతాను. ఏవిటి అతల్లని ముసుగుపెట్టుకొని రావడమేమిటి ! క్లోరోఫారముసీసా ఏమిటి, ఫేనలుగుడ్డేమిటి, యేమిటినీముఖము ఆహాడావిడిఅంతాను. ఈ పాడుసినీమాలొచ్చాక పాడైపోతున్నారుగదా ప్రజ !

వెం:—బాబు పంతులుగారు! చెప్పకాలుతోతన్నండి నన్ను! సినీమా సూసే సాడై పోయానండి! కల్లునీళ్ళకు లేకపోయినా కంచేపు వూరుకోగలనుగాని, సినీమా సూడకపోతే సచ్చిపోతానండి!

గో:—నేనుచెప్పేగా! అవును గాని, ఏమి ఆలోచిస్తున్నావు నీసంగతి! నిజం కోర్టులో చెప్పకుందామనా? లేక, నాకేమి తెలియదని తప్పకుందామనా?

వెం:—నిజంచెప్పకుంటే పీఁకతీసెయ్యరండీ!

గో:—పీఁకతీసేస్తారని ఏమిఎఱుఁగనివాఁడినిఅందులోఁ గుర్చిచ్చుతావా? నిష్కారణంగా బ్రాహ్మణునిచంపించినపాపము వూరికే పోతుం దనుకున్నావా?

వెం:—ఏంటో తెల్లారితే ఎందఱు పుట్టుకొస్తున్నారో, ఎందఱు సచ్చి పోతున్నారో! అందులో ఆఁడో కఁడు!

గో:—నిన్ను పాముకి పాలుపోసిపెంచినట్లు పెంచాను! ఇప్పుడాఖరికి నాకే ఎసరుపెట్టావు! ముండావాఁడా!

వెం:—నానేటిసేశానండిమీకుబాబు! ఏటో అసంగీతపుమేస్టరుపోతే మరొకడినెట్టుకోండి! ఏటి ఆఁడిలో ఉన్నందేటండి లోకమంతాను! ఆఁడు కాకపోతే ఆఁడిబాబింకోకఁడు.

గో:—ఏడిశావు! ఊరుకో నేను ఇప్పుడు మన ప్లీడరుగారింటికివెళ్లి మిమ్మల్నిద్దరిని జామీనుమీఁద విడిపించేప్రయత్నము చేస్తాను! అతరవాత నుభయత్రాపోటీరాకుండా వుండేలాగ కేసునడిపిద్దాము! చూద్దామెలాగుంటుందో! ఇప్పుడు బోలెడంతడబ్బు కక్కాలి! నలుగురినోళ్ళు కట్టెయ్యాలి! ఎవరుతిని సంతోషించడముచెప్పు! నువ్వుతిన్నట్టు అయిందికాదు! నన్నుఁ దిననిచ్చినట్టు అయిందికాదు!

వెం:—బాబు దేముఁడేమీారు! మీారే దేముఁడు! ఇడిపించెయ్యండి! ఇంక బుద్ధిగా వుంటాను!

గో:—నా చేతుల్లో వుందేమిటి విడిపించడము! వెళ్ళి ఎవళ్ళెవళ్ళని పట్టుకోవాలో వాళ్ళనిపట్టుకొనిచూస్తాను.

వెం:—బాబు! కనికరించండి! మొదటినుంచి తమ నెయ్యాలన్నము తిని ఇదికేను!

గో:—అలాగేలేరా! అందుకనే, ఇంతవరకు తీసుకొచ్చావు!

వెం:—బాబు! తమరు సిన్నప్పటినుంచి సూడడము కాదండి! ఇప్పుడు సూడాలండిసూపు!!

(అనుచుండగా తెరపడును).

గో:—(ముందునకువచ్చి) ఏం జెయ్యాలో నాకుఁదెలియుటలేదు. ఏయొక్కరినైనా విడిపించడమంటే కొంచెము సాధ్యము కావచ్చును గాని యిద్దఱిని విడిపించేద్దాము, కేసే యిద్దరిమీాఁద లేకుండా చేద్దామంటే యదియసంభవము! కన్నప్రేమ ఒకవంక, పెంచినప్రేమ యింకొకవంకనన్నుఁ గుంజుఁగదీయుచున్నవి.

(పోలీసు ఇనస్పెక్టరాదారినిపోవుచు నెదురగును)

గో:—అయ్యా! ఇనస్పెక్టరుగారు నమస్కారమండి!

ఇ:—(ఆఁగి) అయ్యా! నమస్కారమండి! ఏమిటిది తమరిలావచ్చారు? ఏదైనా కోర్టుపనివుండివచ్చారా?

గో:—కోర్టుపనికాదు. మీాకు తెలిసేవుంటుంది సంగతంతాను!

ఇ:—ఏమిటిచెప్పండి నాకు తెలుసునోలేదో చూస్తాను!

గో:—అబ్బే! సంగీతపుమేష్టరూ, ఆ వెంకటరెడ్డీ, మొన్న శంకరం హత్యాప్రయత్నం కేసులో అరెస్టయారుకాదండి!

ఇ:— అవునవును!

గో:—వాళ్ళనొకసారి చూసి పోదామనివచ్చాను.

ఇ:—వాళ్ళమీఁద మీకేమి "ఇంటరెస్టు" వుంది ?

గో:—ఆసంగీతపుమేష్టరు మాఅమ్మాయికిమధ్య Tution చెప్తున్నాడు. తెలివైనవాఁడు, చక్కఁగా చెప్తున్నాఁడు. అమ్మాయి అతని దగ్గరతప్ప మరొకరిదగ్గర నేర్చుకోననిపట్టు. ఇప్పుడీనిర్బంధములో నున్నాఁడు పీలుగావుంటే విడిపిద్దాము, తరవాత కేసుసంగతి దేముఁడెఱుఁగునని వచ్చాను.

ఇ:—సంగీతముమేష్టరుమీఁద, నిజానికి, కేసు వుండఁగూడదు. అతఁ డేమి యెఱుఁగడు. పెధవ ఆవెంకటరెడ్డిగాఁడు అతనిమీఁద నుండే యీర్ష్యచేత శంకరం ఇంట్లోనుండి పాటిపోయేటప్పుడు సంగీతపుమేష్టరినని చెప్పి పాటిపోయాఁడఁట ! సంగీతపుమేష్టరంటే యెవరో అనుకున్నాను. మీయింట్లో సంగీతపుమేష్టరుగారే !

గో:— అవునండి ! తరవాత, ఆవెంకటరెడ్డినికూడా చిన్నప్పటినుండి పెంచాను. మాయింట్లో చాలాకాలము వంటెద్దుబండితోలుతుండే వాఁడు నాకు విరక్తిచేత ఆబండి అమ్మివేశాను. అప్పటినుండి యేదోకూలిపనిలోకి యెక్కడకోపోతున్నాఁడు. ఇప్పటకీవాఁడి పెళ్ళామే మాయింట్లో దాసీది. వాళ్ళిద్దరకీ నేనే పెళ్ళిచేశాను. ఇది, అందరికీఘఁడే సంబంధబాంధవ్యాలు.

ఇ:—సరేకానండి, పంతులుగారు ! అయితే వేంకటరెడ్డినికూడా విడిపిద్దామనా ? మీయుద్దేశము !

గో:— పీలుగావుంటే విడిపించుకొని వెళ్దామనేవుందండి !

ఇ:—Impossible ! సంగీతపు మేష్టర్నీ విడవరు. వెంకటరెడ్డినీవిడవరు. వీళ్ళిద్దరినివిడిస్తే, కేసెలాదొరుకుతుందింక ? వీళ్ళనరెస్టుచేసినది జామీనుమీఁద విడుదలచేసే కేసుకాదు. ఇపుడు కోర్టులో రుజువుకావలసినది నేరముఁజేసిన దతఁడా యితఁడాఅని, అలాటి

Intricate Point వచ్చినపుడలాగ నిడిచిపెట్టరు. మీరాట్టే అవస్థపడక వెళ్ళిపోండియింటికి !

గో:—ప్లీడగిని పెట్టి వాదిద్దామనివుంది?

ఇ:— వాదించండి వాదనలదాఁకా వచ్చినపుడు ! కాని, యిపుడువిడిపించడానికి బ్రహ్మశక్యముకాదు. ప్లీడరేదో మీరిచ్చినది పీల్చి వేయడానికి కాని పనిజరగదు.

గో:—పోనీమేజస్ట్రేటుగారిని ఒకసారి ఇంటిదగ్గరచూస్తే !

ఇ:—ఆయనెవరిని చూడరు ఇంటిదగ్గర ! కావలిస్తే కోర్టులో చూడవలసిందే ! చాలా Strict officer ఆయన !

గో:—మరేదో దారిచెప్పండి !

ఇ:—ఏదారిలేదింక ! జామీనుమీఁద ఇంతటిలో విడవరు. ఈకేసు తేలేసరికి రెండుమూఁడేళ్ళు ఎలాగాపట్టుంది. అందాకా వీళ్ళిలా వుండవలసిందే !

గో:—అయ్యో ! ఏమిసేయుదును ?

ఇ:—మటినాడు సెలవిప్పించండి, కోర్టుకుపోవాలి అర్జంటుగా ! (అని పోవును).

గో:—చిత్రము !

సీ॥ కాననాంతరసీమ ♦ కార్చిచ్చునురికియుఁ
గ్రీడమైనాడి దుః ♦ ఖంపకుండు;
జలధిమధ్యంబున ♦ నలలలోఁదవిలియుఁ
గించత్తుకూడ శో ♦ కింపకుండు;
వ్యాఘ్రాగ్రమునుండి ♦ యుర్వీకిలంఘించి
వనటనొక్కింతఁ గ ♦ న్పఱుపకుండు.
నిర్జనభూమిపై ♦ నివసించి నిర్భీతి
యావంతక్లేశము ♦ నందకుండు;

గీ॥ కాని, మత్పుత్రికా మణిఁ • గాంచి యీ వి
షాదవార్త నివేదింప • సమయమందు
నొంతకుంతిశైనయుండియు • నక్లు నేను
దుఃఖవారాశి నెమరీఁది • దాఁగకుందు ?

నేనిఁక యింటికిఁబోలేను. నాసుందరమునకును నాకును నేఁటితో ఋణముదీరిపోయినది. నేను సంగీతపుమేష్టరుని విడిపించుకొని రాఁజాలకపోతినని గ్రామమెరింగిన మరుక్షణమున నామె యసువులఁబాయును. అంత నేనును జీవింపఁజాలను. వేంకటరెడ్డిని విడిపింపలేదని అప్పలమ్మ రోదనముఁ జేయుచుండును. ఆమెదుఃఖమును నే సహింపఁజాలను. ఈదుఃఖసముద్రములో నీఁదులాడుటకంటె నెన్నినాళ్ళనుండియో నేను కోరుకొనుచుండిన "సత్రాన్నము మహానిద్రా" జీవితము నేఁటికి సఫలీకృతమొనర్చుకొనుటమేలు! గృహస్థాశ్రమమువీడి సన్యాసి యాశ్రమము నెల్లరు నొకప్పుడు పొందవలసినదే! ప్రేమబంధములు తాత్కాలికములు! జీవితమస్థిరము; బుద్బుదప్రాయము! కాలినడకను ఇపుడే ఇచటనుండియే బయలుదేరి కాశీక్షేత్రముఁ బోయి విశ్వేశ్వరాలయ ప్రాంగణముచెంతకే ఘటముఁ జేరవేసి సంసారదుఃఖములు మరచియుండెదను. శివుని జటాజూటమునుండి వెలువడి భూమికి ననర్ఘళముగాఁ బ్రవహించి ముప్పదిమూఁడుకోట్ల జీవరాసులను పావనముసేయు గంగాభవాని పవిత్రగర్భమున నీయుర్భకుఁడు జీవితవిరామమునఁ జొరంగలిగినచో జన్మముధన్యంబేయగును.

(అని పోవును)

పంచత్రింశవరంగము.

(ప్రవేశము : సుందరమ్మ, అప్పలమ్మ)

(సుందరమ్మ మంచముపైఁ బడుకొనియుండును)

(అప్పలమ్మ పరిచారముసేయుచుండును)

అ:—లెగిసి కూంత ఎంగిలిపడవమ్మో ! బొత్తిగా నక్కలంలాగై పోనావు ! కళ్ళు లోతుకిపోయాయి !

సుం:—నా కన్నముతినాలనిలేదే ! అబ్బ ! నన్నుఁజంపుకుతినకే !

అ:—బాబురానేదు! ఈయమ్మనెగదు ! ఏటిసేతునుదేముఁడా? నానూ పుట్టేఁదుకట్టంలోవున్నాను ! నా మొగుణ్ణి కొట్లోఎట్టేశారు! నా సవఁడితోసెప్పుకోనుదేవుఁడా ?

సుం:—ఏమేవు ? అప్పలమ్మో ! నాన్నగారొచ్చారా ?

అ:—రాందే ! ఆబాబొత్తే యీాగెహానారమేమి ?

సుం:— చాలాసేపయిందికాదే నాన్నగారువెళ్ళి ?

అ:—ఏటి చాలాసేపు ! అల్లదిగో ! పొద్దక్కడుండగా ఎల్లిపోయారు ?

సుం:—ఏంతంటాలు పడుతున్నారోపాపము !

అ:—తంటాలుకాదటమ్మో ! ఆబాబీయాలకాపీనీళ్ళయిన నరిగా తాగే నేదు.

సుం:—ఎంతనష్టవచ్చిందే నాన్నగారికి నామూలాన్ని, ఈవేళ లేవగానే ఎవరిముఖంచూశేరో ! పాపము !

అ:—నామొగంసూడాలి, నీమొగంసూడాలి, ఇంకెవరిమొగం సూత్తారీయింట్లో !

సుం:—అప్పలమ్మోయి ! నున్వెవరినో, ఏంజరుగబోతుందో కనుక్కొస్తానన్నావు ! కనుక్కొచ్చేవటే ?

అ:—కనుక్కున్నానమ్మో !

సుం:—ఏమంటాడతను ?

అ:—యంత్రమ్మేసేడమ్మా ! అందులో ఏటీకనబడలేదంట !

సుం:—ఏవీ కనబడకపోతే అది ఏమన్నమాట ?

అ:—ఏంటో ఆదిమొకము ! నా మొకము ! అదేమన్నమాటో ?

సుం:—అదికాదే ! మేష్ట్రిగారిని విడిచిపుచ్చుతారన్నమాటా ? విడవరన్నమాటా ? ఏవిటి దానిఅర్థము ?

అ:—అదే తెలడములేదట !

సుం:—ఏడిసినట్లేవుంది యంత్రముపేయడము ! ఈపాటికి మానుకోనమనలేకపోయావు యంత్రాలువేయడము మంత్రాలు చదవడము ?

అ:—ఆకట్టికరణమంటాడమా ! ఆయమ్మని సూడాలి ! సూచి యంత్రమువేస్తే బాగా కనబడుతుందంటాడు !

సుం:—సంతోషించాము ! అక్కరలేదనిచెప్పేయి !

అ:—మళ్లీ సెప్పటమెందుకు ?

సుం:—చెప్పిరాకపోతే యిక్కడకే సిద్ధమవుతాడేమో ?

అ:—నీపురుగట్టుచ్చుకోను !

సుం:—(నగుచు) ఏడుపులో నవ్వొస్తున్నాదే నీమాటలవల్ల !

అ:—బెంగెట్టుకోకమ్మా !

సుం:—ఒసేవు ! అప్పలమ్మా ! నాన్నగారుకూడా రాకపోవడము నాకు మనస్సేమీ బాగులేదే ! చాలాకంగారుగావుంది !

అ:—నాకడుపులోనూ గాబ్రిగావుందమ్మా అదేంటోకాని !

సుం:—పోనీ, పనితెమలకపోతే యింటికొచ్చి భోంచేసి మళ్ళీవెళ్ళినా బాగుండును ? వేళకు కడుపులోకాస్త ఏదోపడకపోతే యింకా వేళకల్లా తలనొప్పి వస్తుందే నాన్నగారికి !

అ:—నానెఱగనేటి ? అదే నేను అనుకుని ఏడుత్తుంట !

సుం:—అప్పలమ్మాయి! నేను విచారించకుండా కూర్చుంటాను కాని నువ్వెళ్ళి నాన్నగారెందుచేత రాలేదో కనుక్కురా!

అ:—ఎక్కడకెళ్ళను? నిన్నొగ్గేశే?

సుం:—నాకేమిఫరవాలేదు! వెళ్ళిరావే! నాన్నగారిసంగతి, మేష్టరు గారిసంగతికూడా ఏంజరిగిందో బాగా కనుక్కురా!

అ:—నా మొగుఁడిసంగతొద్దేటి?

సుం:—అతనిసంగతికూడా కనుక్కురావే! వద్దం టెవరన్నారు? అతనుమాత్రము పరాయివాఁడా?

అ:—అదేగందా!

సుం:—వెళ్ళవు అప్పలమ్మా?

అ:—ఎల్లకేమమ్మా!

సుం:—మరేమిటి ఆలస్యము?

అ:—అమ్మాయినొగ్గేశి నువ్వెందుకొచ్చావని ఉగ్గయిపోతాఁడేమో బాబు అని ఆలోసించుచున్నాను!

సుం:—అమ్మాయేపంపిందను! అలాఅన్నతరవాతకూడా నాన్న నిన్నే మయినాఅంటే నాతో చెప్పుతర్వాత!

అ:—సెప్పి మీయిద్దరికీ ముల్లెట్టడానికా?

సుం:—మాకు ముల్లుపెట్టడమేమిటి? తండ్రికూఁతురునూ లఖనుకుంటాము ఒకరినొకరు విధాయకము!

అ:—అయితే ఎల్లిరమ్మంటావు నువ్వు!

సుం:—వెళ్ళవే!

అ:—సరే (అనిపోవును)

సుం:—(ఏకాంతముగా) నాకేమియుఁదోఁచకున్నది. ఏది సంకల్పించిన వది భస్మీభూత మయిపోవుచున్నది. దినములు మంచివికానవు డిట్లు జరుగుననుకొందును? నాముాలమున నాన్నగారష్టకష్టము

లకుఁ బాల్పడుచున్నారు. అది నేనెఱుఁగుదును! కాని ఆయనఁ బడెడికష్టములకుఁగాని, నాప్రారబ్ధమునకుఁగాని యేదైన గమ్యస్థాన ముండవలయునా లేదా? ఈరోజున నాన్నగారికి భోజనమే లేదు! పాపము! నామేస్టరుగారు భోజనముఁజేసిరో లేదో! వారికెవరు భోజనముపెట్టెదరో కదా! చెఱసాలాధికారులు పెట్టెద రనుకొందును! మానాన్నగారింటికివచ్చి భోజనముఁజేసి మేస్టరుగారికి భోజనము "టిఫినుకారీయర్" లోఁబెట్టి పట్టుకొనివెడలినచో నెంతబాగుండెడిది! నా చాదస్తమేకాని, మేస్టరుగారి కక్కడ భోజనముసేయ మనస్కరింపదు! సరే, నాన్నగారికే దేమిపాడలవాటో కాని, యనుకున్నపని సానుకూలముగువరకు భోజనమును నిద్రయునక్కరలేదు (అనుచుండగా)

(ప్రవేశము : సంగీతపుమేస్టరు)

సుం:—(దిగ్భ్రమఁజెంది లేచి నిలచిచూచుచుండును)

సం:—సుందరం!

సుం:—మేస్టరుగారా?

సం:—మరచిపోయావింతలోనే!

సుం:—క్షమింపుఁడు! నాకనులను నేను నమ్మఁజాలకున్నాను.

సం:—నీకళ్ళనే నీవునమ్మనపుడు ఇంక నన్నేమినమ్మతావు! నువ్వెవరవో ఎఱుఁగనంటావు! అదే Next step?

సుం:—(దరిఁజేరి నమస్కరించి) పాపాత్మురాలను క్షమింపుఁడు! మే మొక దుర్వార్తవిన్నాము! అది నిజమైయైనచో మీరిటకెట్లు రాఁగలుగుదురని సంశయాత్మురాలనై యించుక ప్రథమసందర్శనమున సంకోచించినమాట సత్యమే!

సం:—అదంతా explain చేస్తానుకాని, యిప్పుడునన్ను నమ్మవా?

సుం:—పరిహాసమాడుచుండిరి దానికేమి గాని, యెట్లు రాఁగలిగిరో చెప్పరు ?

సం:—నీకు వెంకటరెడ్డికి నాకు జరిగిన సంభాషణంతా మొన్నఁ జెప్పే లేదా ?

సుం:—అవును చెప్పారు !

సం:—అదే కడుపులోఁ బెట్టుకొని శంకరాన్ని చంపెయ్యడానికి పోయాఁడు. తుదకి, చంపునో మానునో కాని, శంకరంపెళ్ళాం అదృష్ట వశాత్తు లేచిందఁట ! వీలులేక పాఱిపోయాఁడఁట ! పోతూపోతూ తనమీఁద ఎక్కడ అనుమానంపడి పట్టుకుంటారోఅని నామీఁద నక్కసున్నతీర్చుకోడానికి యిదోరూపకం ఏర్పడిందికనక నాపేరు చెప్పిమరీపోయాఁడఁట ! అంచేత నన్నుగూఁడా తీసుకుపోయిన మాట నిజమే !

సుం:—చూశారా వెంకటరెడ్డిపోఁగాలము ! "పెంచినకుక్క కాలుఁ గఱచిందని" మానాన్న నెత్తినెక్కించుకున్నందుకు మా బాగాఁ జేశాఁడాఖరికి !

సం:—ఆతరవాత వాఁడినికూడా పట్టుకున్నారు ?

సుం:—మానాన్నగారు కనబడలేదండిమీకు ?

సం:—కనబడ్డారు ! కనబడడమేమిటి ! అక్కడకేవచ్చారు ! మాటా డేరు !

సుం:—ఏమిమాటాఁడేఁడు మానాన్న ?

సం:—ఏవిటీగోడవన్నారు. విషయమంతాచెప్పేను. సరే, కేసుసంగతి తరవాత చూద్దాము జామీనుమీఁద విడుదలఁజేయిస్తానిప్పటికి అని వెళ్ళిపోయారు !

సుం:—తరవాత మానాన్న మీకు కనేబడలేదా ?

సం:—లేదు. తరవాత వెంకటరెడ్డినికూడా ఒకసారి కలుసుకొని మా ఊరికొస్తానన్నారు!

సుం:—ఇంకా వెంకటరెడ్డిని విడిచిపెట్టరేమిటి నాన్నగారు?

సం:—విడిచిపెట్టేదెలాగ? ఉద్యోగం పోయినవాడుకూడాను

సుం:—మానాన్నకి బాగా చాదస్తముండి మేష్టరుగారు! ఎవర్నైనా నమ్మడంటే యిక విడిచిపెట్టడు ఏమివచ్చినాసరే!

సం:—అది చాదస్తమేమిటి? అది గుణవంతులకు లక్షణము

సుం:—నేను కాదనరుకాని, అంతఅధికంగా మంచి యుండకూడదండి మనిషికి!

సం:—ఆయనకేం ధన్యుడు! ఆయనరోజులు చక్కగా వెళ్ళిపోతున్నాయి!

సుం:—మేష్టరుగారు, మరియెలా విడిచిపెట్టారండి మిమ్మల్ని?

సం:—నాకు విశేషంగా తెలియదు. ఎలాపట్టుకున్నారో అలాగే విడిచిపెట్టేశారు అనుకున్నానునేను!

సుం:—ఇంక కేసు లేకుండాపోయిందాండి?

సం:—అప్పుడే అయింది! సొంతపూచీకత్తు పుచ్చుకొని నన్నొకడనే వదిలేశారు!

సుం—వెంకటరెడ్డిని వదలలేదన్నమాట?

సం:—లేదు! వాడిని వదులుతారనితోచదు!

సుం:—పోనీయండి! అందులోనే వుండనివ్వండి యావజ్జీవము! మహామిడిసిపడిపోయాడీమధ్య!

సం:—నన్నుమాత్రము వదులుదురాయేమిటి? వాకబుచేస్తారు చూశావు రహస్యముగా మామూలుబట్టలుకట్టుకొని తిరిగే పోలీసు ఆఫీసర్లు! వారు, ఎవరివల్లనోవిన్నారు నిజస్థితి! పైఆఫీసర్లకు

జెలియఁజేసారనుకుంటాను. వారు సొంతపూచీకత్తుపుచ్చుకొని వదిలెయ్యమన్నారు. "ఏకత్తునునిప్పంటే ఆకత్తెకాల్తుంది."

సుం:—బాగాఁజెప్పారు! భగవంతుఁడు లేఁడూ గంపంతకన్నెట్టుకొని చూస్తో!

(ప్రవేశము : అప్పలమ్మ)

అ:—(విచారముతో) నాన్నగారెక్కడా కనఁబడనేదమ్మా! తెగతిరి గాను! (సంగీతపుమేస్టర్నిఁ జూచి) ఇదిగో బాబెప్పుడోవచ్చే శాఁడే!

సుం:—అయ్యో! ఏమిటినాగతి?

అ:—అమ్మాయి! కాబుసంగతి, నాను సూడలేదుకాని, మాపెద్దమ్మ కూఁతురు సేపలబజారుకాడకన్పించి చెప్పింది, అదిసెప్తానుకాని ఎనకనుంచి (అని సంగీతపుమేస్టర్నిఁజూచి) నామొగుఁడిని ఒగ్గ లేదేంబాబు?

సం:—నీమొగుణ్ణి వెనకనుంచి ఒగ్గుతారు!

అ:—అఁ! పోనీబాబు! అఁడింటికొత్తేను నూకాలమ్మతల్లికి ఒడపప్పొ సలిమిడెట్టుకుంటాను?

సుం:—నీమొగుఁడుమాటకేమి? నాన్నగారిమాట మొదటచెప్పవే!

అ:—నామొగుఁడుమాటకేమా? ఏటీ నీమొగుఁడు నీకుముద్దు! నా మొగుఁడు నాకుముద్దు!

సుం:—అబ్బ! రాకాసిముండ! చెప్పవే నాన్నగారిమాట!

అ:—నాను సూడనేదు! బాబు కెత్తెక్కిందఁట! సేపలబజారులో సేపలకొనడానికెళ్ళారంట!

సుం:—చేపలబజారులోకెళ్ళారా?

సం:—ఇదేమిటి? చాలాచిత్రంగావుందే! (అని ఆావడినిలచియుండును)

సుం:—అఁ! చెప్పు! చెప్పు!! వెళ్ళి!!!

అ:—సేవల చేరమాడుతుంటే అక్కడందఱూ ఆశ్చర్యపోఁగూరఁట !
ఏటీ యీబాబెప్పుడూ కూరగాయలమార్కెట్టుకే రాఁడు ! మం
చిబ్రాహ్మఁడు మతిపోయిందికాఁబోసు అని ఆబ్కారులోనుంచి
దాఁటించి వందుదాఁకా తీసుకొచ్చి దిగబెట్టి వెనక్కెళ్ళిపోయా
డఁట ఒకఁడు !

సుం:—పరమేశ్వరా ! నిశ్చయముగా నేను దురదృష్టవంతురాలను !
నానుండియే నాన్నగారిమతి చలించియుండవచ్చును. అయ్యో !
కష్టపరంపరలు బండిచక్రమువలె తిరుగుచున్నవి ! ఏమిసేయు
దును ?

సం:—నిజమేటే అప్పలమ్మా ! ఇదంతాను ?

అ:—మాపెద్దమ్మకూఁతురబద్ధమాడతాదేఁటి ?

సం:—నీకు పెద్దమ్మలేదఁటకదా ! కూఁతురెక్కడనుంచి వచ్చిందే
దానికి ?

అ:—ఏటి వున్నవాళ్ళకొకటే పెద్దమ్మ లేనివాళ్ళకందఱూ పెద్దమ్మలే !
నాకంటెపెద్దోళ్ళంతా నాకుపెద్దమ్మలే ! సిన్నోళ్ళంతాపిన్నమ్మలే!

సుం:—మేష్టరుగారు ! నేను నిలువలేను క్షమింపుఁడు.

సం:—సుందరం ! నిలవొద్దు నువ్వెక్కడ ! వెళ్ళి Bed మీఁదపడుకో!
అప్పలమ్మా ! తీసుకెళ్ళవే అమ్మాయిగార్ని ! నేనువెళ్ళి పంతు
లుగారి సంగతంతా కనుక్కొస్తాను.

అ:—బాబ్లిరా ! నీకోసమాబాబొచ్చేఁడుగాఁడేఁటి !

సుం:—అయ్యో ! నేనెంతపాపురాలను ? నాకష్టములిఁక నెన్నటికి గట్టె
క్కవుకాఁబోలును !

అ:—నువ్వు మాటాడకమ్మా ! ఒగర్పొత్తాది !

సం:—అమ్మాయిగారు బహుజాగ్రత్త ! ఆమె నాన్నగారిసంగతి ఏమి
జరిగిందో చూచుకొనివస్తాను.

అ:—ఎల్లవయ్యా! ఎల్తానంటావు ఎల్లవు! అమ్మాయినొగ్గి ఎల్ల లేకు న్నావేటి?

నం:—ఓసికాణాచి! (అనిపోవుచు వెనకకువచ్చి) సుందరము! పంతులుగారినంగతి నేనుచూసుకుంటానుగాని నీవుమటి......

సుం:—అయ్యో! నన్నేమిచేయుమందురు? మీరేమిసేయుమన్న నది సగౌరవముగాఁ జేసెదను.

నం:—ఏడవకూడదు.

అ:—ఏడ దెల్లి రావయ్యా!

సుం:—ఏడువను! వెళ్ళిరండు!

నం:—అదీ నీవుచేయవలసినది! (అని పోవును)

అ:—(సుందరమ్మకుఁ బరిచారముచేయుచుండును)

(తెరపడును.)





# ఓస్నీ డాటరు.

పంచమాంకము.

పదమూఁడవరంగము.

(ప్రవేశము : శంకరము, గంగమ్మ)

(ప్రదేశము : చావడి)

(శంకరము రోగివలె మంచముపైనఁ గూర్చుండియుండును గంగమ్మ పరిచారము సేయుచుండును).

గం:—ఇఁకనైనా బుద్ధిగావుండండి! చావుతప్పి కన్నులొట్టపోయిందిపుడు!

శం:—నువ్వెలాచెప్తే అలానడుచుకుంటానిఁకముందు; నువ్వాగీఁటుగీచి అది దాఁటవద్దు అంటే అంతే అలా ఆగీఁటు హద్దుమధ్యస్థమై వుండిపోతాను!

గం:—కుక్కవాలిగుంటలో నున్నంతసేపూ అలాగా అనుకుంటుందఁట! తెల్లారితే ఎవరిళ్ళలోను దూరగూడదని! తీరా తెల్లారిన తరవాత రాత్రి అనుకున్నసంగతి మరిచిపోతుంది.

శం:—అయితే నన్ను కుక్కతో పోల్చావు కొనకి!

గం:—కుక్క నీరసమైపోయిందా ఏమిటి? కాలభైరవస్వామి! తాఁవు మీఁరుచేసిన పాపాలుపోవడాని కెప్పటికైనా కాశీవెళ్ళితే కాలభైరవస్వామిని చూస్తేనేకాని కాశీయాత్ర పూర్తికానేకాదు.

శం:— ఒసేవు! నువ్వేమను! నేనుపడతాను! కుక్కను, నక్కను, నందను పందను పట్టాను! నువ్వంటూవుండబట్టే నాకు గం డంతప్పింది! లేకపోతే యీపాటికి యమలోకంలో పంచాంగం జెప్తుండేవాఁడినే! ఇదిగో పెళ్ళామంటే ఇలావుంఁడాలి! అర్ధాంగ లక్ష్మి కాదటండీ భార్యంటే!

గం:—ఇపుడెన్ని చిలకపలుకులైనచెపుతారు! ఈ నాలుగురోజులు పోయాక మళ్ళి యెప్పటాకేకొండప్ప! నాకుఁదెలియాదేమిటి మీగుణాలు! ఆరుమాసములువాయించిన మద్దెల ఓటితో గట్టిదో తెలియదు?

శం:—ఒసేవుగంగీ! "గంగీ" అని నిన్ను నీచపఱచే ననుకోకు! అది నేను నీకుఁబెట్టిన ముద్దుపేరు!

గం:—బాగానేవుంది వ్యారుకుందురు!

(ప్రవేశము : సంగీతపుమేష్టరు)

సం:—తాతా!

శం:—తాతాఅనకరా! ఇక్కడవీముసలమ్మఉంది దెబ్బలాటకురాగలదు!

గం:—(లేచినిలుచుంఁడి)ఏమిటి మళ్ళీయెందుకొచ్చావునాయునానువ్వు? నిన్నెవరువిడిచిపెట్టారు జైలులోంచి!

సం:—భగవంతుఁడు!

శం:—వాఁడుకాదే వెఱ్ఱిముఖమా! వాఁడేమీ యెఱుఁగనేఎఱుఁగఁడు!

గం:—అయ్యో! ఎఱుఁగకపోవడమేమిటి?

శం:—వెంకటరెడ్డి యిలాగేవుంటాఁడు!

గం:—ఏమోకర్మము! మీరు మనుష్యుల్ని ఇట్టే నమ్మేస్తారు! ఎవ ళ్ళైనా కాస్త నవ్వుతోమాటాడితే యింక పట్టపగ్గాలుండవు.

శం:—కాస్పేపువూరుకో "గంగీ" నువ్వు! (అనిసంగీతపుమేష్టరువంకఁ

దిరిగి)ఏమిరో అబ్బాయి! ఏమిటి ఎలా రాగలిగావు నువ్వు ? ఎవళ్లు విడిపించారు నిన్ను ? చెప్పు అసంగతంతాముందు ?

సం:—దిక్కులేనివాళ్ళకి భగవంతుండేదిక్కు !

శం:—నీమీఁదేమి అనుమానములేదోరే అబ్బాయినాకు ! నీవేమను కుంటున్నావో కాని !

సం:—నేనేమి అనుకోవడములేదు ! నన్నుగురించిఎవరేమి అనుకున్నా సరే నాకుసంతోషమే !

శం:—మళ్ళీఅదేమాట !

సం:—లేదుకాని, శంకరం, ఒకపనిమీఁద వచ్చేనోయి నీదగ్గరికి ?

గం:—మీపనులేమిటో మీరేచూచుకోండినాయనా ! మా ఆయన్ని ఇఁకదింపకండి !

సం:—ఇదివరకుమేము దింపేమేమిటమ్మా ! మంచీచెడ్డా తెలియకుండా మాటాడుతారు !

శం:—(గంగమ్మనుద్దేశించి) నువ్వూరుకోవే ! ఏవిటో అవ్యవహార మేమిటో తెలిసికోకుండా ముందే కజ్జాకు కాలుదువ్వుతామేమే!

గం:—పోనియ్యండి నేనిక్కడనుండి పోనేపోతాను ! (అని రివ్వునఁబో వును) (గంగమ్మ వెళ్ళిపోయినతర్వాత)

సం:—మంచిపెళ్ళామే దొరికిందినీకు శంకరం !

శం:—అచ్చే ! అలాకాదోయి ! మంచిదే ! కాస్త "కస్సుబుస్సు" మంటుంది కాని మొదట, తర్వాత నెమ్మదిగా దారిలోకొస్తుంది !

సం:—ఏమో ఎలాపడుకొస్తున్నావో నువ్వు ! నేనైతే శాశ్వాధ్యాయము చేసేద్దును అలాటిపెళ్ళమునాకే దొరికితే !

శం:—తొందరపడకోయి ! ఇలా పర్గిగల్భాలుచెప్పినవాళ్లే పెళ్ళాలకు దాసోహాము సల్పుచుంట ! అవునుకాని, యేమిటి వ్యవహార మన్నావుచెప్పవు ? మీ కేసు వ్యవహారమా ?

సం:—ఆగినదిలెయ్యి! దానిమాట తరువాత సావకాశముగా మాటా డుతానుకాని, గోపాలరావుపంతులుగారు కొన్నిరోజులుబట్టి కనఁ బడడములేదోయి! వారిఅమ్మాయి సుందరం చాలా బెంగపెట్టు కొంది! తిండితినడములేదు! నిద్రపోవడములేదు!

శం:—ఎక్కడకు వెళ్ళివుంటారుచెప్మా, ఎన్నిరోజులబట్టి కనఁబడడము లేదు?

సం:—సుమారు నెలరోజులయివుంటుందనుకుంటాను! ఆయన ఎక్క డకీ ఇంట్లోకూఁతురితో చెప్పకుండా వెళ్ళేస్వభావముకలవాఁడు కాఁడు.

శం:—నాకుఁదెలియదాఏమిటి! అసలు ఎలా వదిలారుఇల్లు?

సం:—నన్నువిడిపించడానికని కోర్టుకొచ్చారావేళ! అదే ఆయన్ని నేను ఆఖరిసారిచూడడము! నాదగ్గరకొచ్చేముందే వారిఅమ్మాయి చూసిందఁట! ఎవరుచూచినా అప్పుడే ఆఖరుసారి! మళ్ళీఏమై పోయారో తెలియరాలేదోయి! నీకేమైనా తెలిసిందేమో అని నిన్ను కనుక్కోడానికొచ్చాను.

శం:—శ్రీరామ రామ! నాకుఁదెలియదు! నేనేదీగుమ్మము కదలడ ములేనిదే! ఇంకా డాక్టరువచ్చిచూసి పోతునేవున్నాఁడుద యమూ సాయింత్రమును!

సం:—అయితే నీకు తెలియనే తెలియదన్నమాట!

శం:—అబ్బే నాకేందెలుసునురా? నాకేదైనా తెలిస్తే వారింటికి కబురు పెట్టెయ్యనూ?

సం:—మేమింకోవార్తవిన్నాములే!

శం:—అదేమిటి?

సం:—కొంచెం మతిచెలించిందని!

శం:—మతిచెలించడమే!

సం:—ఊఁ !

శం:—ఏమో, అయితేఅయివుండొచ్చు! పాపము! ముసలాఁడయిపో తున్నాఁడు పంతులు! సుఖంగా కాలిమీఁదకాలేసుకుని కూ ర్చొనితినేయోగ్యత లేకపోయింది! డబ్బుంటేమాత్రము సుఖం గా తినడానికి యోగముండొద్దూ ?

సం:—సరే! శంకరం! వచ్చినపని అయిపోయింది! నేనువెళ్తా!

శం:—ఒరే అబ్బాయోరాయి! మనగోడవసంగతి చాలా మాటాడాలి ఏవిటి అపుడే వెళ్ళిపోతానంటావు!

సం:—సావకాశముగా మాటాడుతాను వెనకనుంచివచ్చి! ఇపుడు పం తులుగారెక్కడున్నారో పట్టుకొని యింటికి తీసుకెళ్ళడమే నా కర్తవ్యము, నా కేసుకంటెముఖ్యమైనసంగతి! నన్ను వెళ్ళనియ్యి!

శం:—అయితే వెళ్లుగాని, నేనేకర్మం ఎఱఁగనుసుమా ఒరే అబ్బాయో యి! అపుడుండే కంగారుమీఁద మాఆవిడేవెళ్ళి ఏమేమో చెప్పేసిందఁట! వాఁడిమీఁద ఎందుకు చెప్పేవేఅనినాకుఁ దెలిసి వచ్చాక తలవాచేటట్టు చీవాట్లుపెట్టాను!

సం:—ఆమాట ఎత్తేనా నేనిపుడు ?

శం:—నువ్వు ఎత్తకపోతేమాత్రము నేను చెప్పొద్దటరా ? సాటివాళ్ళ ము! తెల్లారితే ముఖముఖాలు చూచుకొనేవాళ్ళము!

సం:—సరే పోతాను!

శం:—శుభం! వెళ్ళిరా!

సం:—(వేగముగా) పోవును.

శం:—(మంచముపైఁ బడుకొనును)

గం:—(మరలఁబ్రవేశించి) ఏమిటి ఎందుకొచ్చాఁడామేష్టరు!

శం:—మొగాళ్ళు మాటాడుతుంటే నువ్వు అట్టే కలుగఁజేసుకురాకు! తెలిసినతనముకాదు! తెలియనితనముకాదు,

గం:—పోనీలెండి! రేవుదాఁటినదాఁకా ఓడమల్లయ్య; తర్వాత బోడిమల్లయ్యాను మీ మొగాళ్ళ వ్యవహారము.

శం:—నాకు తలతిరుగుచున్నది. కొంచెముసేపు మాటాడించకు. (అని పడుకొనును)

గం:—సరే పడుకోండి! (అని పోవుచు) ఒళ్ళారితే లేడిపిల్ల నేనౌఁగనూ? (అనును)

(తెరపడును)

---

పదునాల్గవరంగము.

(ప్రవేశము : గోపాలరావుగారు)

(ఉన్మాదావస్థ)

(ప్రదేశము—వీధి.)

ప్రపంచకము కొఱివిదెయ్యము! నరుఁడు భూతవైద్యుఁడు! ఆత్మ పిశాచావృతము! అబ్బెబ్బే! ఆత్మకాదయ్యా పిశాచావృతము తెలివితక్కువవాఁడా! నరుఁడే (అని నెత్తిపై మొట్టుకొనును) ప్రత్యుత్తరము తప్పినందుకు గిద్దెఁడునూనె యినికేటట్టు మొట్టుకాయే గట్టిమందురా ఆత్మారాముఁడా! అహహా! (వికటముగానవ్వును) నిన్ను పూజించడమంటే అన్నంతినడమే కాదూ! ఎంత సులభప్రక్రియరో! అన్నంతినడం కొందఱికి జీవనాధారమూ! మరికొందరికి మరణకారణమూ! అహహాహ! (అని మరలనవ్వును) విష్ణుమూర్తిభార్యపేరు లచ్చి! నాపెళ్ళాం పేరు లచ్చి! మాదొడ్డతుడిచేపాకీదానిపేరు లచ్చి! శ్రీకారము [illegible]ప్రదము! విషప్రదము! పున్నమి అమావాస్య ఒక[illegible]నాఁడొచ్చినట్టుంది! (అని మరలనవ్వును) నే నాఁడదానినైపుట్టే

చక్కగా చీరఁ గట్టుకుందును, సింగారించుకుందును, పువ్వులు ముడుచుకొందును. మొగుఁడువచ్చే బుజ్జగిస్తూగాఁ గొజెగించు కొందును ! (అని మరలనవ్వును) ఇప్పుడు మగాఁడిస్తే పెళ్ళాం చస్తే ఏంజేశాను ? (కన్నీళ్ళతో) అయ్యో ! మహాలక్ష్మీ ! నన్నుఁబాసిపోతివా ? (బిగ్గరగానేడ్చుచు) నన్ను మృత్యుదేవతా వక్త్రగహ్వరమునఁద్రోసి మొండికిఖండిస్తే యింక జీవించి యుండనేలననికాదు నీ వాగ్రహించుచున్నావు ! ఆగ్రహించవద్దు ! దాసరిగప్పులు దండముతోసరి ! రా ! దిగు ! భూమికి దిగు ! దిగవేం ! ఇదిగో దిగనందుకు చంపకాయ ! (అని గాలిలోఁ జేయి విసరికొట్టినట్టు నటించును) అప్పుడే ఏడుస్తున్నావు ! అమాత్రిందానికే ! (అని వెనకకుఁదిరిగి) ఒరే అబ్బాయిలు ఎవళ్లురా నన్నుఁజూసి పళ్లుయికిలిస్తున్నారు ! కోతి వెధవల్లారా ! "బ్రిహ్మచారీ శతమర్కటః" కోతుల్లోను కొండముచ్చులురా మీరు ! కోతిముదిరి కొండముచ్చు అయింది ! తొంతరమ్మ వూసరివిల్లయింది ! చెరువుగట్టుమీఁద కొంగవాలింది ! చేపలు కొంగనుఁజూచి నీటిలోనికి పాజిపోతాయి ! అవునిందులో ఆశ్చర్యమేముంది ? ఇకటాగ్రి మీచదువులుమండ ! ! శ్రీకృష్ణమూర్తి గోపికల బట్ట లెత్తుకపోయి పొన్నచెట్టెక్కి కూర్చొని వాళ్ళనేడిపిస్తుంటే వేదాంతం చెప్తున్నాడంటారుగా వెర్రాళ్ళలారా! అవతారాలు పదా ! అంతమహిమగలవాఁడైతే దేవుఁడు ఒక్క అవతారంఎత్తి ఫూరుకోక పది యెందుకెత్తేఁడు చెప్మా ! చేతగాక ! అహహా ! (అని మరల వికటముగానవ్వును) భూమి గుండ్రింగావుందా ! ఏమి నలుచదరంగా లేదు ? అది నీవుచూసి చెప్పావా ! ఇది నేచూడకపోడానికి ! విత్తు తలక్రిందుగాఁ బాతిపెట్టినా భూమిపైకే మొలుస్తుందేమి ! రాయి మొలావిసిరినా

భూమిమీఁదకు వచ్చిపడుతుంటేను ! ఇదీ నాకు తెలిసిన ప్రకృతి శాస్త్రము ! భూగోళశాస్త్రం ఖగోళశాస్త్రంరాదు నాకు ! నేను ఒకవిమానాన్ని ! ఈరెండుచేతులే నారెఁక్కలు ! నక్షత్రమండలాని కెగురుతాను ! ఇదిగో ఎగురుతున్నాను ! ఎగరలేదా ! అయ్యో ! నామతికాల ! చిన్నజంతువులను కొట్టుకొని పెద్దజంతువులుబతకాలా! బతికినవాళ్ళమీఁద చచ్చినవాళ్ళకుప్రేమా ! చచ్చినవాళ్ళమీఁద బతికినవాళ్ళకుప్రేమా ! ఏమిటి ప్రేమేమిటి? ప్రేమంటేఏమిటి చచ్చుపెద్దమ్మా ! చెప్పు ! చెప్పు ! (అని నేలను దన్నును) మొగుఁడూపెళ్ళాముమధ్యనుండేది ప్రేమ ! బిడ్డలకుఁ దల్లిదండ్రులకు మధ్యనుండేది ప్రేమ ! ఏమి న్యాయముయ్యా ! రెంటికీ ఒకటేమాటా ! ఇద్దరిపెళ్ళాల మొగుఁడిలాగ ! (అని మరలనవ్వును)

(ప్రవేశము : సంగీతపుమేష్టరు)

సం:—(గోపాలరావుగారిని,నిమీలితనేత్రుఁడై చూచుచుఁదనలో)ఆహా! ఏమి యీయనవైఖరి ! (అని యబ్బురపడుచుండును)

గో:—(సంగీతపుమేష్టర్ని పరీక్షించిచూచి) ఎవడవురానువ్వు ! వెళ్ళిపో! నీపనేదో నీవుచూసుకో !

సం:—పంతులుగారు నమస్కారమండి !

గో:—(వికటముగా నవ్వుచు) నమస్కారములేదు. తిరస్కారములేదు పో ! నాజోలి ఎందుకునీకు ?

సం:—నేను సంగీతపుమేష్టర్నండి పంతులుగారూ !

గో:—సంగీతపుమేష్టరివా ? అయితే నాకు సంగీతముచెప్తావు ? "స స సరిగమపదనిసా" ఓరి సంగీతమంతా నాకొచ్చేశునుపోరా !

సం:—పంతులుగారు, ఇంటికిరారు ?

గో:—ఇది యిల్లుకాదూ ? ఇంకేయింటికి రా రమ్మంటావు ?

సం:—మీకు మనస్సు చెడింది ! తర్వాత మాటాడుకుందాము ! ఇప్పుడు నాతో యింటికొచ్చెయ్యండి !

గో:—ఓరి నీయిల్లుబంగారముకానూ నీమనస్సుచెడింది! ఎవఁడవోకాని ఏయింటికి రమ్మంటావునన్ను ! నరబలిగాని వేస్తావేమిటి ?

సం:—సుందరం మీయింటికి రావడములేదని బెంగపెట్టుకొని నిద్రాహారములుమాని కంటికి మంటికి ఏకధారగా నేడ్చుచున్నది పంతులుగారూ !

గో:—కావలిస్తే నువ్వుపోయి యేడు ! సుందరమెవరు ?

సం:—సుందరము మీఅమ్మాయికాదండి !

గో:—(దీర్ఘాలోచనము నటించి) నాఅమ్మాయి ! సుందరం ! ఏడ్చుచున్నదా !

సం:—ఏడవడములోనూ సామాన్యపుఏడుపుకాదండి !

గో:—ఏడుపులో "నోవలిటీ" అన్నమాట ! కాదోరేఅబ్బాయి !

సం:—(గోపాలరావుగారిని అలింగనమొనర్చి) రండి ! పంతులుగారు మీకు సంగతంతా చెప్తాను.

గో:—ఇక్కడేచెప్పేయ్యి ! ఏం జెప్పఁదలఁచుకొన్నావో అదంతా ?

సం:—ఇదిరోడ్డు ! రోడ్డుమీఁదచెప్పవలసిన విషయంకాదది !

గో:—(పట్టువిడిపించుకొనుచు) ఒరే వదలునన్ను !

సం:—మిమ్మల్ని విడవను !

గో:—విడవకపోతే ఇదిగోమాత్రి ! (అని లెంపమీఁద సంగీతపుమేస్టర్ని కొట్టును)

సం:—కొట్టండి నాకుసంతోషమే !

గో:—కొట్టే సంతోషమేమిటబ్బాయి !

సం:—ఉంది కొట్టడంలో సంతోషముంది! ఏడుపులో నవ్వుంది! చావులోఁ బ్రతుకుంది! బ్రతుకులో చావుంది!

గో:—నువ్వు భావకవీశ్వరుఁడవు కావుకద?

సం:—భావకవీశ్వరుఁడనేనండి!

గో:—అయితే ఏమిటి! నన్ను "బంకనక్కిరికాయ" లాగ పట్టుకున్నావు?

సం:—మీరేమనండి! మిమ్మల్ని తీసుకెళ్ళితేగాని నేను వెళ్ళను!

గో:—నేను రాకపోయినా తీసుకెళ్తావన్నమాట?

సం:—ఓహో! భేషుగ్గా!

గో:—కాలికికాడుగట్టి రోడ్డుమీఁద బరబర ఈడ్చుకుపోతావా?

సం:—అలాగ తీసుకెళ్ళను! పాదాలకుమొక్కి అడుగులకు మడుగులొత్తుతో తీసుకెళ్తానుమిమ్మల్ని! నెత్తిమీఁద మోసుకొని తీసుకెళ్తానుమిమ్మల్ని!

గో:—నన్ను మోయఁగలవురా అబ్బాయి నువ్వు?

సం:—సందేహములేకుండా!

గో:—వట్టిది దొంగమాటాడుతున్నావు దొంగా! (అని చెక్కిలి వేళ్ళతోఁ గొట్టును)

సం:—పంతులుగారూ, రారూ!

గో:—వస్తానుగాని ఏమిపెట్తావునాకు నువ్వు?

సం:—మీకేమికావలిస్తే అది పెట్తాను!

గో:—కడుపునిండా అన్నముపెట్తావు?

సం:—(తనలో) పాపము అన్నముతిని ఎన్నాళ్ళయినదో పంతులుగారు (ప్రకాశముగా) పంచభక్ష్యపరమాన్నములతోటి మీకు కడుపు నిండా అన్నముపెట్తాను! మీకాళ్లుపట్తాను! మీరేమిచెయ్యమంటే అదిచేస్తాను!

గో:—ఆషాడభూతిగాఁడవు కావుకద !

సం:—నన్ను పరీక్ష చెయ్యండిమీరు ! నాగొప్ప నేను జెప్పుకోవడము లో లాభమేముంది ?

గో:—చేస్తాను ! నిన్ను పరీక్ష చేస్తాను !

సం:—రారా పంతులుగారూ !

గో:—రమ్మంటావు నన్ను ! తప్పదు ?

సం:—తప్పదు ! తప్పదు !

గో:—నడవలేను ! బండికట్టించు !

సం:—బండికట్టించి తీసుకునేవచ్చాను ! అదిగోబండి !

గో:—బండొద్దు ! మోటారు కారు తీసుకురా ?

సం:—కారూతీసుకొచ్చాను ! అదిగో కారు !

గో:—నడుస్తానుపదవోయి ! దేవుఁడిచ్చిన కాళ్లున్నాయి !

సం:—నడవండి మరీ మేలు !

గో:—(వడివడిగా నడచుచు) ఎలాగుందిరా నానడక ?

సం:—మీనడకకేమండి రాజానడక ?

గో:—నువ్వు రాణీనడకనడు ! మనమిద్దరము రాజూరాణీలాగ నడుద్దాము !

సం:—వదరు పంతులుగారు ! (అని దీనవదనముతోఁ బ్రార్థించును)

గో:—నీముఖంజూస్తే జాలేస్తున్నాది వదవస్తున్నాను (అనిపోవుదురు)

---

పదునైదవరంగము.

(ప్రవేశము : గోపాలరావుగారు; సుందరమ్మ; సంగీతపుమేష్టరు; అప్పలమ్మ; శంకరము; గంగమ్మ)

గో:—శంకరం! ఒకవిధంగా మంచి, యింకొకవిధంగా చెడ్డా కలగఁజేసావు మాకుటుంబానికి! సరేలే, చేతులుకాలేక ఆకులుపట్టుకొనడములో ప్రయోజనమేముంది!

శం:—పంతులుగారోయి! చెంపలు వేసుకుంటాను! నాతప్పులన్నీ ఒప్పులుగా భావించాలి! తమరే అలాఅని సెలవిస్తే నేనీవూళ్లో వుండలేనిఁక!

గో:—ఏమి యీపూరంతా కంబార్లుచేసానేమిటి నేను?

శం:—అట్టేకాదండి! బుద్ధికి బృహస్పతివంటివారు మీరు! ఓర్పునకు భూమివంటివారు! దానానికి కర్ణుఁడువంటివారు!

గో:—భట్రాజులా తయారయావు ఆఖరికి!

శం:—మీరేమన్నా సరే పడతాను! మీకుటుంబమువల్లే మాకుటుంబము నేఁటివరకు నిలచియున్నది. మానాన్నగారికి మీనాన్నగారికి, కావలసినంతస్నేహము! మానాన్ననాన్నగారికి మీనాన్ననాన్నగారి అలాటిస్నేహమే! మూఁడుతరాలఁబట్టియున్న స్నేహము మనది యివాళానిన్నా తెచ్చిపెట్టుకున్నదికాదు! ఈ వేళపొమ్మంటేపోదు!

గో:—మూఁడుతరాలఁబట్టి యుందికనుక కొంతవిశ్రాంతి కలగఁజేస్తే బాగుంటుందేమో ఇఁకముందు!

శం:—అశాంతముండవలసిన స్నేహానికి విశ్రాంతి కూడదండి!

గో:—సరేలే! ఇఁక మనగొడవలోనికి దిగుదాము! నేనెందుకు నిన్ను మీయావిడను పిలిపించానో తెలుసునా?

శం:—తెలియదు! కాని, ఏదో అంతపనిలేకపోతే ఎలాగా పిలిపించరని నాకు తెలియును! సరే, మీరు పిలిపించడమేమిటి? కాకిచేత కబురుపంపిస్తే చక్కావచ్చేస్తాను నేనే! ఈగొడవలవల్లకాని లేకపోతే తెల్లారేసరికి మీదర్శనముచేసేవాఁడనుకానటండి!

గో:—అవును! ఇదిగో! ఈమేష్టరుగారిని నువ్వుకుదిర్చావు!

శం:—నేనుకుదర్చడమేమిటిలెండి! వాఁడికి మీఅన్నము ఋణముంది!

గో:—అబ్బ అదేనయ్యా! అతనికి మాఅన్నము ఋణముంది! మాకు అతనివద్ద ఋణముంది! ఎలాగైతేనేమి?

శం:—పోనీ అలాగే అనండి!

గో:—ఇతను సంగీతముచెప్పడానికొచ్చి అమ్మాయిని మెల్లిగా జేబులో పడేశుకున్నాఁడు!

శం:—(సంగీతపుమేష్టరినిఁజూచి) ఓరి దేముఁడా నీయసాధ్యముకాల!

సుఁ:—(నవ్వును)

సం:—(నవ్వును)

గం:—(నవ్వును)

గో:—అతన్నేమిఁఅనకు శంకరం నువ్వు! సంగతంతావిను!

శం:—చెప్పండి! చెప్పండి! అంచేతే అమ్మాయి అతనిన్నికూడా నీ కేసులో పట్టుకున్నారనేసరికి అన్నంమానేశింది!

శం:—పాపము అలావుంటుందిలెండి అనురాగమంటె!

గో:—అవును నీకు బాగా తెలిసియుంటుంది?

శం:—అప్పుడే తాటాకులు కట్టున్నారు పంతులుగారు!

గో:—వినవోయి! నేనతన్ని విడిపించడానికెళ్ళి ఇనస్పెక్టరుగారితో మాటాడిచూస్తే వారన్నారు అది జామీనుమీఁద విడిచే కేసుకాదు పంతులుగారు మీరు ప్రయాసపడడంలో లాభంలేద న్నారు. అమ్మాయి ఏడవడంతోటే నడుము విరిగిపోయింది,

ఇంకీ ఆవార్తకూడా విన్నాక మతిపోయింది ; ఏమివాగేశానో !
ఎవఁనేమి అనేశానో !

సుం:— నాన్నా ! చేపలబజారులో కెళ్ళి చేపలబేరమాడేవఁట !

గో:— ఏమో ! ఆడేనుకాఁబోలు !

అ:— సేపలు తిందామనివుంటే నాకుసెప్తే నానొండుకురానేఁటి ?

గో:— (అప్పలమ్మనుఁజూచి) వండుకొద్దుకాని ! లేకపోతే వండుకెళ్ళి నీమొగుఁడికి పెట్టిరా ! తింటాఁడుపాపము అక్కడ పెట్తున్నారో లేదో కక్కముక్కలు !

అ:— అపునేటి గోపాలరావుబాబు ! నామొగుఁడేఁడి ! మీరందఱు సక్కగాకూకున్నారుగందా !

గో:— నీమొగుఁడిడుగో ! (అని శంకరమునుజూపును)

అ:— ఉట్టిదిబాబు ! ఏటో కిట్టనోళ్ళు మావాళ్లే పుట్టించారు ఆ నీలి మాట !

శం:— (గంగమ్మనుజూచి) విన్నావా ఆమాట ?

గం:— అయ్యో వినకేమి ! నాకింకా చెముడురాలేదు,

సుం:— (నవ్వును)

పం:— (నవ్వును)

గో:— (అప్పలమ్మనుజూచి)నేనంతా అమారుచేశేసాను. అతన్నికూడా ఇవాళ వదిలేస్తారు ! కాసేపటికో కూసేపటికో వచ్చేస్తాఁడు అతనుకూడాను !

అ:— బాబు తెలుసుకుంటే రాఁడేఁటి ? బాబు మళ్ళీ కోర్టుకు పిలిపించరుగంద !

గో:— సరే అప్పుడేలయింది ! వ్యాజ్యానికి వెయ్యేళ్ళు మనిషికి నూరేళ్ళు ఆయుష్షు ! కొన్నాళ్ళిలా "నలుగుడు" పడవలసినదే !

అ:— బాబు ఆఖరికి మళ్ళీ కొట్లో ఎట్టెయ్యరుగద ?

గో:—ఇదిగో శంకరం గంగమ్మ సాక్ష్యంలో వుంది అరంగంతాను !

శం:—మీరెలాచెప్పమంటే అలా చెప్తాను నేను ! (గంగమ్మవైపుఁ
జూచి) దానిచేతకూడా అలాగేచెప్పిస్తాను !

గం:—పంతులుగారు ! మీమాట జవదాఁటమండి !

గో:—సరేనమ్మా ! ఇపుడు జరిగిపోయినదేమీ జరిగిపోయింది ! ఎన్న
నుకున్నా ఇఁకనది మార్పుచెయ్యలేము ! ముందుతోవ చూ
సుకోవాలి ! అనవసరంగా ఆవెంకటరెడ్డిని నలుగురులో పెట్టడ
మముతప్ప ఇంక ప్రత్యక్షంగా మనం జేయవలసినదేమీ లేదు.
వాఁడు మనవాఁడే ! ఏకులమైతే నేమిటి అనుకూలమైతే !
వాఁడిని చిన్నప్పటినుంచి పెంచాను ! కన్నప్రేమకంటె పెంచిన
ప్రేమ ఎక్కువది ! కనక నాముఖంజూచి వాఁడిని రక్షించండి !

అ:—(గంగమ్మనుఁజూచి) రక్షించునాతల్లీ ! మీపేరుచెప్పుకుంటాము.

శం:—(గోపాలరావుగారినిఁజూచి) అవును మీరు చెప్పవలసినమాట
పూర్తికానివ్వండి ! ఏమిటిరామాయణములోనీపిడకలవేట్లాట!

గో:—ఆఁ ! తర్వాత ! ఈమేష్టరుగారు నాకోసం గాలించేసి ఊరూరు
తిరిగారు పాపము ! ఏయేవూళ్ళు తిరిగారో, ఎంతసొమ్ముఖర్చ
యిందో లెక్కపత్రంలేదు.

సం:—నన్ను స్తోత్రముఁజేస్తున్నారు పంతులుగారు !

గో:—స్తోత్రముకాదు నిజమే ! తిరిగి నన్నుపట్టుకొని, ఆపట్టుకునేటప్పు
డు ఒకలెంపకాయకూడా కొట్టేశానఁట !

శం:—మంచిపనిచేశారు ! నాపేరుచెప్పి యింకొకటి కొట్టలేకపోయారు!

సం:—(శంకరమునుజూచి) ఇదిగో వెంకటరెడ్డిని అప్పఁజెప్పుతానునీకు !

గం:—(సంగీతపుమేష్టర్నిఁ జూచి) నయమే వూరుకోండి ! అవేమి
హాస్యాలు !

శం:—(గంగమ్మనుఁజూచి) నిన్ను మాటాడొద్దన్నాగాదూ !

గం:—పోనీ మాటాడనులెండి ! అయితే నన్నెందుకు తీసుకొచ్చారు ?
గో:—ఉండవమ్మా ! నువ్వు లేకపోతేఎలాగ ? నీపనికూడావుందిపుడు !
శం:—చెప్పండి పంతులుగారు !
గో:—ఆతరవాత, మదనపిల్లి తీసుకెళ్ళి మణిచెలించినందుకు మందిప్పించారు !
శం:—అయితే విశ్వాసము చూపించాడన్నమాట !
న:—ఏమివిశ్వాసము ! నాశరీరముకోసినా వారిఋణముఁ దీర్చుకొనలేను !
సుం:—(ముసిముసినవ్వులు నవ్వును)
గో:—మళ్ళీ నాయింట్లో నన్నుఁబ్రివేశపెట్టారు. ఇదంతా ఎందుకుఁ జేశారంటే అమ్మాయే కారణభూతురాలు !
శం:—అవునండి అమ్మాయివల్లే ! అమ్మాయిలేకపోతే అతనెవరో మీరెవరో !
సం:—(నవ్వుచుండును)
సుం:—(నవ్వుచుండును)
గో:—సరే, ఏకారణముచేతనైతేంచేశారు! అతనికికావలసినది అమ్మాయి ! నాకుఁ గావలసినది అమ్మాయి ! అమ్మాయికిఁ గావలసినవాళ్ళము మేమిరువురము ! అమ్మాయి నా "ఓన్లీడాటరు" ! కనక ఆమె యిష్టప్రికారం జరిగించేద్దామనివుంది !
సం:— సుం:— (శిరముల వాల్చుకొని నగుచుందురు)
శం:—శుభం ! చేసెయ్యండి ! బాగానేవుంది !
గో:—ఇంక కులము పోతుంది !
శం:—పోనివ్వండి ! ఇపుడు కులముగాదండి కావలసినది డబ్బు! డబ్బుంటే కులములో కలిసిపోవచ్చు ! డబ్బులేకపోతే ఏకులమన్నా వకటే !

గో:—మరి ఏమిటి నీయభిప్రాయము ?

శం:—చెప్పేశానుకాదండి నాయభిప్రాయము !

గో:—గంగమ్మగారు ? మీయభిప్రాయము !

గం:—అలాంటితలంపుంటే చేశెయ్యమనే నాయభిప్రాయము !

గో:—సరే ! మేష్టరుగారు ! ఏమిటి మీయభిప్రాయము ?

శం:—వాఁడభిప్రాయానికేముంది వాఁడికోరికే అది !

సం:—(నవ్వి మాటాడకుండును)

గో:—సుందరాన్ని నేనడగను.

శం:—అడగొద్దు ! ఆఁడపెళ్ళివారము మనము !

సం:—అయితే నావాళ్లు ఎవళ్లూలేనిలోటు యిపుడు కనిపించిందన్న మాట !

శం:—ఎందుకురాసంత ! పంతులుగారిపంచను పడ్డావు ఇంక నీకేమికా వాలిరా ! తిను దున్నపోతులాగతిను !

గో:—సరే ! లేవండి ! లే ! సుందరం !

సుం: — (లజ్జాభరితవదనముతో లేచును)

గో:—లే అబ్బాయి !

సం:—(లేచును)

గో:—(వారికరములఁగలపి పూలమాలలవారిచేనొండొరులపై వేయిం చును) శంకరం ! దీవించు !

శం:—వంశాభివృద్ధిరస్తు ! (అని నాల్గుపూవులఁ జల్లును)

గో:—మీరమ్మా ! (అని గంగమ్మవైపుఁజూచి అనును)

గం:—(పూవులఁజల్లును) ముందొకకొడుకుపుట్టాలని దీవించాలనివుంది మరి అది ఎలాఅనాలో తెలియడములేదు.

శం:—సుపుత్రాప్రాప్తిరస్తు అను !

గం:—అలాగే !

గో:—బాగుంది! మీ నోటివాక్యాన్ని అలాజరిగితే ఆ కుఱ్ఱాడికి "ఈశ్వరచంద్రుఁడు" అని పేరుపెట్టాలి! ఎంచేతనంటే వంగ దేశములో నీశ్వరచంద్ర విద్యాసాగరులవారు మొట్టమొదట హిందూబ్రాహ్మణ స్త్రీ పునర్వివాహాలు బయలుదేరదీసారు. వారిపేరు స్మరించుకోవడము మంచిది.

శం:—మరోకొడుకుపుట్టే!

గో:—"వీరేశలింగము" అని పెట్టమని నాప్రార్థన. ఎంచేతనంటే కందుకూరు వీరేశలింగముగారు ఆంధ్రభూమిమీఁద అంతసేవా చేశారు.

గం:—ఆఁడపిల్లపుట్టే!

గో:—బాగా అడిగావమ్మా! ఆఁడపిల్లపుట్టే "రాజ్యలక్ష్మమ్మ" అని పెట్టమని నాహితోపదేశము! ఎంచేతనంటే వీరేశలింగంపంతులుగారికి సతీత్వమువహించి యాయుద్యమమునకు సహకారమొనరించినదాయిల్లాలే! ఆవిడ మనకెందుకీగోడవంటే ఏమో పంతులవునని యూరుకొనడివాఁడేమో!

శం:—(సంగీతపుమేష్టర్నిఁజూచి) అలా చెయ్యరా! అప్పుడే మీకుఁ బుట్టబోయేవాళ్ళకు పేర్లేర్పడ్డాయికూడాను! ఇఁకేం!

సం:—ఊరుకోరాతాతా!

శం:—అదే అనొద్దంట!

గం:—తాతా!

శం:— నువ్వు మాటాడకే! (అని భార్యనువారించును)

(ప్రవేశము : వెంకటరెడ్డి)

(అందఱు నానందపడెదరు)

వెం:—(గోపాలరావుగారినిఁజూచి) బాబు! బాబు! నన్ను తన్నండి! నంపెయ్యండి!

గో:—ఊరుకో వెంకటరెడ్డి! ఇప్పుడేమీ మాటాడకు! సంగతంతా తర్వాతచెప్తాను!

వెం:—ఏటిబాబు! ఇల్లంతా తోరణాలుకట్టేశారు! గుమ్మాలికి పసుపు కుంకములెట్టేశారు! ముగ్గులెట్టేశారు!

గో:—అమ్మాయికి పెళ్ళిచేస్తున్నాను!

వెం:—ఏఁడి పెళ్లికొడుకేఁడి?

గో:—(సంగీతపుమేష్టర్ని(జూపి) ఇఁడుగో!

వెం:—ఈఁడా?

గో:—ఒరేయి! నోరుమూయి!

వెం:—(నిశ్శబ్దముగా నుండును)

గో:—కనక మనము విందుఁజేసుకుందాము!

వెం:—చెయ్యండిబాబు! కోడిమాంసముకూర నాను నండించి తెచ్చుకుంటాను!

సుం:—అవి యిక్కడకు తేకుసుమా!

వెం:—దొడ్లో అవ్వులపాకదగ్గర ఎట్టుకుతింటానమ్మా! ఏటి నీపెళ్ళేటి నాను కోడిమాంసముకూర తినకపోవడమేటి?

గో:—సరే! తెచ్చుకోరా!

వెం:—సిత్తము! సిత్తము! (శంకరమునుజూచి) ఖర్చుకిచ్చేద్దునా? (అనును)

శం:—పంతులుగారు చూశారావీఁడు వెంకటరెడ్డి!

గో:—ఒరేఁయ్! నీకేమిచెప్పాను!

వెం:—బాబాల్లకుంటాను!

గో:—ఇన్నికష్టాలుపడి యీశుభకార్యం మనంజేస్తున్నాంకనక మనవల్ల ఎవళ్ళయినా యేమైనా నేర్చుకోవలసినదుంటే నేర్చుకోడానికి ఒకమాటచెప్పి మరీ విందుకుపోదాము!

శం:—కానివ్వండి !

వెం:—సెప్పండిబాబు !

గో:—

సీ॥ నీటుఁగులుక్క శిరోజముల్ ♦ లోటుచేసి
యొంటిపూటభోజనమును ♦ వంటయింటి
సేవఁగల్పించి విధవ శు ♦ శ్రూషఁజేయఁ
గామబాధానివృత్తి మా ♦ ర్గములుగావు !

ఎల్లజీవులున్ విషయభో ♦ గేచ్ఛఁగోరు
ప్రాణముల్ శల్యగతమగు ♦ వరకు మేన,
ప్రథితసృష్టి ధర్మమెకాని ♦ వ్యక్తిదోష
మేమిలేదు ప్రాజ్ఞులరు మీ ♦ రెఱుఁగరొక్కొ !

జన్మమెత్తుట యొక పరి ♦ సర్వజీవ
తతికి జన్మసౌఖ్యముఁబాసి ♦ తనరజనులు
హర్షమొందఁడు బ్రహ్మ యు ♦ హర్నిశంబు
తృషితులై యుండఁగోరు సం ♦ తతులనతఁడు !

కనుక, బాలవితంతువుల్ ♦ గల గృహస్థు
లార ! ననుబోలు దుఃఖాత్ము ♦ లార ! రండు !
పెండ్లిసేయుఁడు మీబాల ♦ విధవలకును
కులములేకున్న మోక్షముఁ ♦ గలదు మీకు !



శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాల జగన్నాథపురం, కాకినాడ.

